సేవాశ్రమ గ్రంథమాల ప్రథమ కుసుమము.

శ్రీః

# భక్త జీవనము.

గ్రంథకర్త:

పుతుంబాక శ్రీకృష్ణయ్య



పబ్లిషర్సు:

సేవాశ్రమము, పెదపాలెము.

తెనాలి భారతీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1933.



వెల రు. 0-5-0.

శ్రీ

# అంకితము

పాతివ్రత్యాది గుణసంపన్నయు, నిరంతర శ్రీకృష్ణపాదారవిందధ్యానయు,దయావతియు నస్మత్ప్రియజననియునగు నాగాంబకు భక్తిపూర్వకముగా నీ కృతి నంకిత మొనర్చుచున్నాడను.

# సంపాదకీయ విజ్ఞప్తి.

మా గ్రంథమాలలో నియ్యది ప్రథమ కుసుమము. భారతభావిభాగ్యోదయమునకు యథాశక్తిని దోడుపడుట మానుషధర్మముగా నెంచి పూర్వపు గురుకులముల నాదర్శముగా గొని కృషిసలుపవలెనను సంకల్పముతో దాదాపు నాలుగువత్సరముల క్రిందట సేవాశ్రమమను పేర నొక సంస్థను నెలకొల్పితిమి. దీనికి సంబంధించి యిప్పటికి మూడు శాఖలు గలవు.

౧. సారస్వతము. ౨. కృషి. ౩. స్వదేశీ వస్తుప్రచారము.

ఇందులకు ప్రోద్బలముగా గ్రంథప్రచురణకు గడంగితిమి. అందు జాతీయధర్మము, స్వదేశీవస్తుప్రచారము, పారిశ్రామిక విద్య, ఇతిహాసము, రాజనీతి మున్నగు విషయములను ఆబాలవృద్ధమునకు సులభముగ దెలిపెడి చిన్న గ్రంథములను ప్రచురించుటయే మా ముఖ్యోద్దేశము. ౧౯౨౧ వ సం॥ నుండి కలకత్తాలో ప్రచురితమగుచున్న "నవజీవన గ్రంథమాల" యను హిందీ ప్రచురణమును దృష్టాంతముగా గొని ప్రకృతము దానినే అనుకరింప దలచితిమి.

సాధారణముగా వేవతమువారైనను భగవదారాధనము చేయకుండ యేకార్యమునుచేయరు. అందు ప్రత్యేకముగా హిందువులకు ముఖ్యమైన యాచారముగాకూడ యేర్పడినది. అందులకు మేము ప్రథమపుష్పముగా, పరీక్షిద్విలాసము, భక్తహృదయము, అను గ్రంథములను వ్రాసి నట్టి శ్రీయుత పుతుంబాక శ్రీకృష్ణయ్యగారిచే యిపుడు రచింపబడిన, భక్తజీవనమును ముద్రింపదలచితిమి. ఈగ్రంథకర్త సహజముగా భక్తిపరులు. అప్పుడప్పుడు వారు భగవదానందములో తన్మయులై పరవశత్వముచే ఆనందమును, దుఃఖమును పొందుచుందురు. అట్టియవస్థలు పొందుచు వ్రాయబడినది యీ గ్రంథము. ఇందుండు సహజమైనభక్తిని పాఠకులే చదివి యానందించెదరుగాక యని వారికే వదలుచున్నాము. ఉదారహృదయులును, భక్తులును అగు శ్రీయుత పుతుంబాక శ్రీకృష్ణయ్యగారు తమ యీ గ్రంథమును మాగ్రంథమాలకు నొక కుసుమముగా నొసగినందులకు వారికెంతయు వందనములు.

ఇట్లు సుజనవిధేయులు,

సేవాశ్రమ సేవకులు.

# ప్రబోధము.

సోదరా! నీదృష్టి నొక్కపరి పరమేశ్వరుని వంకకు ద్రిప్పుము. నిన్ను సృజించినది పరమేశ్వరుడు. నీకు గావలసిన సమస్తపదార్థముల నుత్పత్తిజేసి నీకొసంగుచున్నది పరమేశ్వరుడు. ఆతడు నీయాకలిని దీర్చికొనుటకు సమస్తరుచ్యఫలముల నొసంగుచున్నాడు. నీదప్పి దీర్చికొనుటకై మధురజలముల నిచ్చుచున్నాడు. నీ వినోదములకై చిత్రచిత్రములగు పుష్పముల బ్రభవింప జేయుచున్నాడు. నీ సేదదీర్చుకొనుటకై చల్లని కమ్మతెమ్మెరల బ్రసాదించుచున్నాడు. రాత్రింబవళ్లు నీకోరకిన్ని సౌఖ్యముల నొడగూర్చుచు, నీపై బ్రేమామృతమును గురియించుచున్న నీ మేలికయగు భగవానున కొక్కపరి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పింపజాలవా? అట్లు చేయజాలనిచో నీజన్మము వ్యర్థముసుమా. విషయసౌఖ్యముల నన్నియు ననుభవించి, ముందెప్పుడో తీరుబడి జేసికొని దైవచింతనను జేయగలననెడి ధైర్యముతో నుండకుము. జరి

గిన కాలము నీది. జరుగుచున్నకాలము నీది.
ఇకముందు జరుగబోవు కాలములో నొక్క
లిప్తమాత్రమైనను నీది యనెడి భ్రాంతిలో
నుండకుము. ఈ క్షణముననే నీవు మృత్యువు
నోట బడుటకు లున్నదని గట్టిగా నెరుంగు
దువుగదా? ఎరిగియున్నచో నీకీ యాలస్య
మేటికి? భగవంతుని గీర్తించుటకు రేపనుమాట
యెందులకు? రేపు రేపనుభావమున కొక్కత్రోపు
నిచ్చి లైటకురమ్ము. అదిగో ఆప్రేమస్వరూపి
నారాధింపుము. ఆహా! యాతడెంతటి యను
రాగవంతుడు? అటు చూడుము. సంధ్యారాగ
రూపమున నాతనిరాగరసము నెట్లు వెదజల్లు
చున్నాడో కనుంగొనుము. కెంజాయ లలము
కొని ద్విగుణీకృతశోభతో ప్రకాశించుచున్న
నూత్నపల్లవయుతములగు నా వృక్షాగ్రముల
వంక కొక్కపరి తలయెత్తుము. అయ్యవే నానా
విధ పక్షిసంతానములు. వాని కంఠములనుండి
విశ్వమోహనుడగు భగవానుని విపంచీనస్వన
మెట్లు బయలుదేరుచున్నదో సావధానుడవై
యాలకింపుము. ఆహా! యేమి యాగానము
యెంతమాధుర్యము, యెంతహాయి. యీవిశ్వ

మోహనగానము వీనులవిందు జేయుటలేదా? యీ గానామృతమును గ్రోలి పరవశత్వమున నృత్యమును జేయజాలనివారు మానవత్వమును గోల్పోయియుండరా? ఇదిగో, యీ శుభ్ర జ్యోత్స్న వెన్నెలైన మనసార సేవించితివా ? ఆహా! యేమిది, సుధను గుమ్మరించినట్లున్నదీ వెన్నెల! అదిగో, ఆ నిర్మలాకాశమును నిశ్చల బుద్ధితో గనుంగొనుము ప్రకాశించుచున్న మణులవంటి తారకలు కనుపించుచున్నవే, వాని నెందులకు బుట్టించెనో, యేపదార్థములచే వాని నుత్పత్తి జేసెనో, అవి నిలుచు స్థానమేదియో యొక్కపరి విచారింపుము. ఈ నక్షత్ర విచారణతోనే సరిపుచ్చుకుసుమా. మనమింకను చూచి యానందింపవలసినవి పెక్కులున్నవి. చూచితివిగదా నక్షత్రములను? వాని మధ్యభాగమునం దద్వితీయ సౌందర్యమును వెదజల్లుచున్న యాచంద్రబింబమునుకన్నులకరవుదీరగాంచుము. అయ్యది భగవానుని ముఖబింబముగాదా ? అహో! ఆ బింబమునుండి ప్రకాశవంతమగు చల్లని యమృతకిరణము లెట్లు బయలువేరుచున్నవో చూడుము. ఆ యమృతకిరణములలో

నొక్కసారి నీ యొడలుదడిపి స్నానమొనర్చి పునీతుడవుగమ్ము. రమ్ము, యీ దిక్కునకు దిరుగుము- సడి చప్పుడులేక మెల్లగా వచ్చుచున్న మందమారుతము ననుభవింపుము ఇదియేమియో యెరుగుదువా? పరంధాముని ప్రణయాలింగనము. ఓహో! యేమి సౌఖ్యము! శరీరమున గిలిగింతలు పెట్టినట్లున్నది! ఆకరపద్మము లెంత పేశలములు, యెంత చల్లదనములు, ఈ యాలింగనసౌఖ్యముచే సమస్తజీవులకు మైమరపు గలిగించి మెల్లగా సుషుప్తిని బొందించుచున్నాడు. నీవునుసకలజీవలోకముతో పాటురవ్వంతవిశ్రాంతిదీసికొని బ్రాహ్మీముహూర్తమున నీకొరకు బాడుచున్న శకుంతసంతతుల ప్రబోధగీతముల విని యానందించి నీవును జగదీశ్వరుని కీర్తిగీతముల నొక్కపరి యుచ్చైస్స్వరమున గానమొనర్చి తిరిగి నూతనదినమును పరమేశ్వర ప్రార్థనచే ప్రారంభింపుము. ఈవిధమున నీ జీవితకాలమునంతయు వినియోగపరుప జాలవా? యేమట్లుజూచెదవు? ఆడిన యాటయే యాడుచు పాడినపాటయే పాడుచు కాలము నెట్లు గతింపజేయుదునా యని చూచుచుంటివి గాబోలు? అయ్యది భ్రమ;

సాధనజేయుము, నీకే తెలియగలదు. అదిగో
ఆవంక జూడుము. "రామనామ మను మిఠాయి
యిదిగో రండి సుజనులారా" అని యెలుగెత్తి
గొంతువోవునట్లుదయమునుండి యేకరీతిగ నర
చుచు మార్గమున వచ్చుచు బోవుచుండు వారల
కా భక్తుడు భగవన్నామమను మిఠాయిని
బంచిపెట్టుచున్నాడు, తాను తినుచున్నాడు.
ఎందరికి బంచిపెట్టినను నయ్యది తరుగదు, ఎంత
తిన్నను కడుపునిండదు, తృప్తి నొసంగదు.
ఆమిఠాయిలోని తీపి మొగము మొత్తునదిగాదు.
అదిగో ఆ వచ్చుచున్న మరియొక భక్తుని సంద
ర్శించి ధన్యుడవుగమ్ము. "రాధారమణ మదన
మోహన బృందావన చిన్నికృష్ణా" అనిపాడుచు
పిచ్చివాడై వీధివీధుల దిరుగుచున్నాడు. వాని
యానందమును వర్ణింపదరమా? అయ్యది బ్రహ్మా
నందము. ఎంతసేపు పాడినను ఒక్కటియేపాట,
ఒక్కటియే మాట; అయిననేమి? ఆపాటలో పర
మామృత మున్నది; ఆమాటలో మాహాత్మ్య
మున్నది;ఆభావములో పరతత్వమిమిడియున్నది.
కావున భగవన్నామమునకు క్రొత్త పాతలు
లేవు. "రాఘవేశ్వర చారిత్రము యెంద రెన్ని

గతులఁ వర్ణించినఁ గ్రాలదే” యని యొక కవి నుడివినట్లు పరమేశ్వరుని రీతుల గీర్తించి నను రసముచెడదు. ఆ గాన మమృతవాహిని; ఆపలుకులు ఖండశర్కరా శకలములు. ఉచ్చైస్స్వరమున భగవానునొక్కపరి నాథా! యని సంబోధింపుము; మరల వెనువెంటనే నాథా! యని పిలువక యూరకుండ జాలవు. పిమ్మట, నాథా! అమ్మనాథా! అనాథనాథా! యని పల్లవుల గల్పించి పిలుచుచునే యుందువు. ఎంతసేపు పలికినను నాథా! యనుశబ్దమే; ఆశబ్దమున కంత ముండదు; దానిరుచికి పరిమాణ ముండదు; ఆ శబ్దమునుండి వివిధమైన గానములు బయలుదేరును; అప్పు డాదివ్యగానమున మగ్నుడవయ్యెదవు. ఇక నా గానమున కంతమెక్కడ? ఆ యానందమున కవధియెక్కడ? అనుభవింపుము; ఆ యానందమును తిరిగితిరిగి యనుభవింపుము; యింకను అనుభవింపుము. ఆ యానందరస మెంత త్రావినను అజీర్ణ మనునది లేదు; యెంత గ్రోలినను కడుపు నిండదు; యెంత జుర్రినను తృప్తినొసంగదు. త్రాగినకొలదియు మరిమరి త్రాగవలెనను నాస యెక్కుట మగు

చుండును. అయ్యది దురాశకాదా యని విచా రింతువేమో? అది దురాశకాదు. దాని నిద్ధి యని నిరూపించుటకు దగిన శబ్దములేదు. అది యొక దివ్యచేష్టయని చెప్పిన గొంతవర కర్థము సరిపోవునేమో? కావున భగవత్కథారసము నకు శ్రోత్రపాతలు లేవను నమ్మకముతోడనే యెందరో భక్తు లెన్నియోసారులు గాన మొన ర్చిన భావములేకాని నూతన భావము లేవియు లేకున్నను, ఆ భావములనే తిరిగి నేనొకపరి యీ గ్రంథమున బాడితిని. ఈ గానమున నీవు గూడ పాల్గొని యానందించెదవని నమ్ము చున్నాను.

ఇట్లు

భక్తాంఘ్రి రేణువు

గ్రంథకర్త.

# భక్తజీవనము.

౧

శ్రీహరీ! భవదీయ చరణకమలములకు జోహారు భక్తజనావనా! నీ యుభయహస్తము మిక్కిలి బాగయుక్తమై ప్రకాశించుగాత. త్వదీయ పాదారవిందములు నేత్రానందదాయకములై యస్మదాదుల శిరములఁ బునీతము సేయుగాత. నీ గజమాల మరిమరి పరిమళముల విసరుగాత. నీ చక్రము వీర్యవంత మగుగాత. నీ శంఖము విజయధ్వనుల నిచ్చుగాత. నీశరీరచ్ఛాయ భక్తమయూరములకు నేత్రపర్వమై మైమరపు గలిగించి నర్తనమును జేయించుగాత. నమో నమ శ్రీమన్నారాయణా.

౨

పతితపావనా! మున్నొక్కప్పుడీ దాసుడు తన కష్టపరంపరలను భవదీయకీర్తిని ఛందోబద్ధము గానించి విన్నవించె. నేటి మనోవేగము

ఛందోబద్ధము గానించుటకు తావిచ్చుటలేదు. మనసున బుట్టిన తలంపు లెట్లైనను నీ కెరింగింపక తప్పదు. అయ్యది పద్యమా, గద్యమా యను శంకతో నీకు బనిలేదుగదా నాకంతకు మున్నే పనిలేదు. ఇంక నాలేఖని కడ్డేమి కలదు? న...న

3

కృపావిలోకనా! కాలమునంతము. అందు నా కాల మత్యల్పము. ఈ యల్పకాలమున నప్పుడే కొంత గతించినది. కడచిన కాలమున నే నేమేమియో చేసితిని. నా చేసిన కార్యము లివి యని నేనే చెప్పజాలను. ఆ కార్యము లవసర ములో అనవసరములో నుడువజాలను. కాని, ప్రతిక్షణమును నీ కిప్పటి కార్యక్రమము సరి యైనది కాదు. వేరొక కార్యక్రమము నేర్పరచు కొమ్మను నంతర్వాణిని వినుచుందును. దాని సంపూర్ణార్థమును మాత్రము నేటికిని తెలిసికొన జాలకుంటిని. జగద్గురుడ వగుటచే నీమరుగు జొచ్చితిని. నీవే దాని యర్థమును విశదీక రింపుము. న...న

## ౪

జగన్నాథా ! భవదీయాజ్ఞోల్లంఘన మొనర్చి సమస్త కార్యకర్తృత్వము నాదియే ననుకొనుచు మైమరచి మదోన్మత్తులై స్వేచ్ఛా విహారము సేయు మానవుల పోకడల కెన్నడు నడ్డు దగులక నీవే శరణ్యమని నమ్మి సంచరించెడి నీభక్తులను తేపతేపకు దణ్డమును జూపి ఝళిపించు చుందువు. ఇదియేమి యాగడము? నీ యాశ్రితజనావన బిరుదమున కంతరార్థ మిదియా? బాగు బాగు. న...న

## ౫

ఆశ్రితజనావనా! నీ యాశ్రితుల నీవు చక్కబెట్టక మఱెవ్వరు చక్కబెట్టెదరు? అందుల కనియే నీభక్తుల శిక్షించియు భయపెట్టియు నరి పడ్వ్రమును సొంత బోనీయక జాగరూకుడవై, గురుడవై పాఠమును నేర్పుచుందువు. ఇతరు లన్ననో నిన్నెరుగరు. నిన్నెరుగని వారి జోలి నీకేల? కావుననే వారి బండి సాగనిచ్చినంత

కాలము సాగనిచ్చి పిమ్మట పాపమును ఫలవంత మొనరించు చుందువు. అహా! నీ యాశ్రిత జనావన బిరుదము నీకే చెల్లునుగాక. న...న

౬

కృపాసాగరా! ఒక్కొక్కప్పుడు వీధుల వెంట బిచ్చమెత్తుకొని క్షుద్బాధానివృత్తి చేసుకొను వానిని బంగరుతొట్లలో నుంచి యుయ్యాల లూప జూచెదవు. మరొకప్పుడు సప్త ద్వీపవసుంధరా చక్రవర్తిని సన్యాసిని జేయు చుందువు. వేరొకప్పుడు వేదాంతశాస్త్ర పారంగతుని వ్యభిచారినిగా జేయుచుందువు. ఇంకొక ప్పుడు వ్యభిచారినే వేదాంతశాస్త్ర పారంగతు నిగా నొనరింతువు. బళీ! నీలీల లత్యా ద్భుతములు. న...న

౭

ప్రభూ! సకల జీవజంతువుల సృష్టిస్థితిలయ ములకు నీవే కారణ భూతుడవుగదా! అందు నొక ప్రాణి కష్టమున బుట్టి కష్టమున బెరిగి

కష్టముతో నంత మొందుచున్నది. మరియొకటి కష్టసుఖముల మిశ్రమముతో గాలక్షేపము జేయుచున్నది. ఇంకొకటి కష్టమునెరుగక కాలమును గతింప జేయుచున్నది. ఈకార్యకర్తృత్వము నీదియే యైనచో కొన్ని ప్రాణులమీద నీకు పగయని చెప్పక తప్పదుగదా. న...న

౮

జగత్ప్రభూ! నీకొకరియందు పగయు నింకొకరియందు దయయుగలదా? నీవు సర్వభూతసమానుడవు. సకలజీవులకుం గలుగు కష్టసౌఖ్యములు వారివారి ప్రారబ్ధసంచితములచే గలుగజేయు చుందువు. ప్రతిజీవికిని పురుషకారము నిచ్చియున్నావు. దానినెట్లు వినియోగపరచిన నట్టి లాభము నొసంగు చున్నావు. స్వామి! నీచిద్విలాసము నీకే తెలియవలెగాక.

౯

నిర్వికల్పా! నిత్యమును మెన్నెన్ని జీవరాసులలో పుట్టుచున్నవి. చచ్చుచున్నవి. ఎంద

రెందరో సన్మానింపబడుచున్నారు. యెందరెం దరో శిక్షింపబడుచున్నారు. ఎందరెందరో షడ్రసోపేత భోజనులై మైమరచి తిరుగుచున్నారు. యెందరెందరో త్రాగుటకు గంజిలేక మలమల మాడుచున్నారు. సముద్రము లున్నత భూప్రదేశములగుచున్నవి. పర్వతములు నదీగర్భమున గలసి పోవుచున్నవి. ప్రళయములు వచ్చుచున్నవి. ప్రపంచము లుద్భవించు చున్నవి. ఏదియెట్లైనను నీ నిర్వికల్పమున కంతము లేదు. ఆశ్చర్యమాశ్చర్యము. న...న

౧౦

న్యాయాన్యాయ విచక్షణదక్షా! బహుపరాకు. నేనెన్నెన్నియో దోసము లాచరించితిని. కొన్ని యెరిగి చేసినవిగా నుండవచ్చును, మరికొన్ని యెరుగక చేసినవిగా నుండవచ్చును. వాని నన్నింటిని సైరించుభారము నీదియే నని దీనుడనై మ్రొక్కుకొంటిని. ఇంకేల నన్ను మన్నింపవు? యెందుకు దీవింపవు? న...న

౧౧

సకల జగదాధారా! నీయాధారమున జీవించు నన్నేల పట్టి పట్టి చూచెదవు? "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" అను వాక్యమును పరిపూర్ణముగా నమ్మి "అన్యధా శరణం నాస్తిత్వమేవ శరణంమమ" యని నీపాదములపై బడి మ్రొక్కుకొంటి. ఇంకేల నన్ను కరుణింపవు? నీకేమి పగయా? లేక నన్ను రక్షించుటకేమైన నవధికావలెనా? లేదు లేదు. నీవు సంపూర్ణాధికారివి. న...న

౧౨

భక్తజనవరదా! నావిన్నపము నాలింపుము. నీ కృపాకటాక్షము నొక్కపరి నాపై విసరుము. నాయందు దయయుంచి నీయనురాగచ్ఛాయపై మేలిముసుంగు నొక్కపరి సడలింపుము. నీ యభయహస్తము నొక్కపరి ప్రదర్శించి నేత్ర పర్వ మొనర్పుము. వత్సా! నిన్ను రక్షించితి నన్నతీయని పలుకు మెల్లగా నోటినుండి జార విడుపుము.

౧౩

కరుణానిధీ! పశ్చాత్తాపముచే నాతనువు శోషించి దగ్ధమగుచున్నది. ప్రచండవాయు పీడితమగు సాగరమువలె మనస్సు ఘూర్ణిల్లు చున్నది. ఉన్మత్తునిరీతి బుద్ధి స్వాస్థ్యము తప్పి పోవుచున్నది. ఇంకేల నను పరిశీలించెదవు? నాగుట్టు బట్టబయలు జేసితిని. నీ కృపావృష్టిని గురిపించి తాపము చల్లార్పవే. న...న

౧౪

భక్తకల్పద్రుమా! నాకోరికలు నదీప్రవాహ ములవలె అత్యంతవేగమున ప్రాకులాడుచున్నవి. నీవో, నన్ను ముకుద్రాటగట్టి కొట్టుచున్నావు. నేను వాయువేగమున బరుగెత్తుటకు బ్రయత్నిం చుచున్నాను. మార్గము శిలాకంటకయుతమై కాలు కదల్పనిచ్చుటలేదు. ప్రకృతి తనలో నైక్యము జేసికొనుటకు యత్నించు చున్నది నేనురానని సంకల్పించుచున్నాను నీ వుపేక్షా పరుడవై వినోదమును జూచుచున్నావు. ఈ యుదాసీనత నీకు జెల్లదు.

## ౧౫

సత్యసంకల్పా! నీ సంకల్ప మమోఘము. నీవేది తలంచిన నేదికాదు? సర్వమును నీ యధీనము. నన్నేల యిట్లు కానివానిగా జూచెదవు? నన్ను రక్షించుట కేలసంకల్పింపవు? నే జేయు విన్నపము వినియు, విననట్లేల యుపేక్షించెదవు? నీకేమి గర్వమా? లేదులేదు. స్వామి! అది మదీయ పాపఫలమే కానోపును. న...న

## ౧౬

లోకపావనా! కాలవిలంబనమున కిక నే సైప జాలను. నిత్యమును పరితాపజన్యమగు నాకన్నీళ్ళచే నీ కర్ఘ్యపాద్యముల నొసగుచున్నాను. విశీర్ణమై బ్రద్దలగుచున్న నా హృదయ మిదే నారికేళ శకలములవలె నీకు నైవేద్యమిడుచుంటిని. ఆత్మజ్యోతి నెగద్రోసి నీకు నీరాజనం బిచ్చుచుంటి. ఇంక నీ కైంకర్యం బెట్లుజేసిన దృప్తినొందెదవో యానతిమ్ము. న...న

౧౭

సాధుజనపోషకా! నాకు వేరెవ్వరును సహాయపడువారు లేరు. నాకష్టముల బరిమార్చుటకు జాలినవాడవు నీ వొక్కరుడవే. నన్నేల యిట్లు చులకనజేసెదవు? ఇదియేమి నీకు వినోదమా? అక్కటా నన్నెందులకింక హింసించెదవు? నాపగ్గె గనుంగొనుటకా? అయ్యయ్యో పిచ్చుకపై బ్రహ్మాస్త్రప్రయోగమా? చాలు చాలు. న...న

౧౮

నిష్కళంకా! నన్నేల పరిహాసముల పాలు జేసెదవు? పిల్లికి చర్లాటము యెలుకకు ప్రాణసంకట మనినట్లున్నది. మన సల్లాపము. నమ్మిన నట్టేట ద్రోయువానిని మరల నమ్మువాడుండునా? నిష్కళంక బిరుదాంకితుడవగు నీవు, నమ్మిన భక్తు ననాదరించెనన్న కళంకమున కేల యొడిజాచెదవు? నీకీ బిరుదము నొసంగిన వారినవలెగాని నిన్నన బనిలేదు. ఉన్నమాటాడి నందుల కులుకుజెందకుము. న...న

౧౯

పరమపురుషా! జోహారు. ఒకొక్కొక్కప్పుడు నీపై గోపముచే నిన్ననరాని మాటలనుచుంటినే యని మిక్కిలి వగచుచుందును. మరియొకప్పుడు స్వామీ! నన్ను మన్నింపుము, నాతప్పుల సైరింపుమని ముంగాళ్ళబట్టి ప్రార్థింపుచుందును. మరియొకప్పుడు విసివి వేసారి స్థాణువువలె భావశూన్యుడనై యుందును. వేరొకప్పుడు యేమేమియో ప్రలాపించు చుందును. ఇయ్యది నాయున్మాదావస్థ కాదుగదా? అయినను సంతోషమే నీకొరకున్మత్తుడనైనను మేలేకదా? న...న

౨౦

దురితహరా! నీ చెయిదముల గనుగొని నిను దృప్తిపరచునట్లు సంచరించుటకుం దగిన తత్త్వబోధల నాకేగురువులును జేసియుండలేదు. పర తత్త్వబోధ నొనరించు వేదశాస్త్రాదుల రూపమే నేనెరుగను. నిన్నొకప్పుడు రూపరహితుడనియు, అవాఙ్మానస గోచరుడనియు, నిర్వికల్పుడనియు, మరి యొకప్పుడు దివ్యమంగళ

స్వరూపుడనియు, అర్చావతారుడనియు, సిద్ధ సంకల్పుడనియు, వక్కాణించు చుందురు. ఇం దేది సత్యము, యేది యసత్యము? న...న

౨౧

దివ్యమంగళ స్వరూపా! సాష్టాంగ వందనములు. నీ రూపమును నీ దివ్యవిలాసమును గురించి యెవ్వరెట్లనిన నట్లందురుగాక. నేను మాత్రము నాడు నీకృపచే దర్శించిన శుద్ధ స్ఫటిక సంకాశమగు మేనితో శంఖచక్రగదాది చిహ్నిత మృదుహస్తములతో, కమ్మతావుల నెగజిమ్ము పుష్పదామాలంకృత గళముతో, కెందామరల నధఃకరించుచున్న పదద్వయముతో, చిరునవ్వులు చెలరేగు మోవితో, పూర్ణిమశశాంకునికి బుద్ధిజెప్పు మోముతో, విలసిల్లు నీదివ్యమంగళ రూపమును నాహృదయ పీఠమున బ్రతిష్ఠించి పూజించుచుంటిని. న...న

౨౨

సర్వరూపా! విశ్వమంతయు నీరూపమే కదా? ఇందు నీ రూపముకాని దేది? "నావిష్ణుః

పృధివీపతిఁగ" యని చెప్పబడుచున్న చక్రవర్తి, కూలి దొరకక కుములుచున్న బడుగువాడు, పరవిద్యా ప్రపూర్ణుడగు పరమహంస, ధన సంపాదనా తత్పరుడగు దారిదోపుకాడు, జగన్మోహిని యగు సుందరాంగి, నేలకు జారుచున్న శల్యరాశియగు వృద్ధనారి, వేయేల, సకల చరాచరములును నీ రూపములు. ఇందు నీ రూపముకాని దేదియును లేదు. న...న

౨౩

దీనజనశరణ్యా! తాపత్రయ జన్యములగు దారుణకృత్యములలో నన్ను దగుల్కొనని యకుము. నా యాశాపాశమును తుత్తునియలుగా నొనరింపుము. అరిషడ్వర్గమును నాకు మిత్ర వర్గముగా నొనరింపుము సత్యదయా శౌచాది గుణములచే సంయుక్తునై భవదీయ పాదభక్తిని విడువక జీవించున ట్లనుగ్రహింపవే. న...న

౨౪

దీనబంధూ! ప్రతిక్షణమును మహాయుగముగా దోచుచున్నది. ప్రతిదినమును దుర్దిన

ముగా నగపడుచున్నది. ప్రతిరాత్రియు కాళరాత్రివలెభయపెట్టుచున్నది. ఇట్లెన్నెన్నియో సూర్యోదయ సూర్యాస్తమయముల గ్రమియింప జేసితిని. అక్కటా! యీదీనహృదయమున నింక సౌఖ్యబీజమును నాటుటకు తావే లేదా? స్వామి! బీజావాపనకు నేడే మంచి ముహూర్తము. న...న

౨౫

కరుణామయా! నీ కరుణాగుణ మేభక్తునకైన గుత్తకు యిచ్చియుంటివా? లేక నీయం దది సంపూర్ణముగా నశించిపోయెనా? లేకున్న నిట్లు వాపోవు భక్తుని యింతకాల మిట్టి నిర్దయతో, నిర్దాక్షిణ్యుడవై హింసించుట సంభవించునా? అయ్యో! నిన్ను యాచించుట యెండమావుల నుదకము యాచించుట వంటిదగు చున్నది. నీహృదయ మింత కఠినమని యెరుగక మోసపోతిని. న...న

౨౬

జ్ఞానదాయీ! ఆకసము విరిగి తలపై బడు చున్నను చలింపని ధైర్యమును కష్టపరంపరలు చుట్టుముట్టి బంధించుచున్నను పట్టువిడువని ధార్మికత్వమును, నన్ను ద్వేషించి నా కపకార మును దలపెట్టు మానవుఁడైనను కోపింపని ప్రేమ గుణమును, సమస్తమును నీదియే కాని నాది కాదనెడు నిరహంకార భావమును, పరధన పరకాంతాదులయం దుపేక్షయును, పూజ్యుల యెడ పరిపూర్ణ విధేయతను, అచంచలమైన భవ దీయ పాదభక్తిని నా కనుగ్రహింపవే. న...న

౨౭

చిదానందమూర్తీ! నీ వానందమయ మూర్తివి. నీచే నిర్మింపబడిన భౌతిక ప్రపంచ మానందమయము, నీ విలాసము లానందమయ ములు, నీ సంకల్పము లానందమయములు. నీకృతమగు సృష్టి స్థితి లయము లానంద దాయకములు. నీ సంబంధముగల ప్రతికార్య

మును ఆనందరూపనే. దుఃఖములు నీ మాయా
కల్పితములే కాని సత్యమైనవి కావు. న...న

౨౮

నాథా! భవదీయ గాఢాలింగన మొక్కపరి
చూరగొననిమ్ము. ప్రాణపతీ! త్వదీయ మృదు
శీతల కరస్పర్శానంద మొక్కసారి నాకొసంగి
నంత మాత్రమున నీ గొప్పతనమునకు లోటు
వచ్చునా? నీవు దీనులయిండ్లలో వసించుచుందు
వని పెద్దలు వచించెదరే, అది రిత్తమాటయా?
కాకున్నచో నాయాక్రందనమును నీవేల విని
పించుకొనవు? స్వామీ! యిక నీతాపము చల్లా
రదు. ప్రావృణ్మేఘమువలె నీ కృపావృష్టిని
గురిపించి నా తాపము చల్లార్పవే. న...న

౨౯

విశ్వరూపా! నిను ప్రసన్నుని జేసికొనుటకై
వ్రతము లాచరించుట నాచేత గాకున్నది.
తపములంతకుమున్నే చేయజాలను. సుస్థిరుడనై
నీమూర్తిని సేవించుదమన్న సంసారజంజాటము
పైకొని వచ్చుచున్నది. వేదవేదాంగముల నేరిచి

నిను దెలిసికొందమన్న కాలమననుకూలముగా నున్నది. సర్వసంగపరిత్యాగి నగుటకు దగిన దార్ఢ్యము కనుపించుటలేదు. నీయందలి కాంక్ష మాత్రము నను విడువకున్నది. ఏసమయమందైనను నాధా! యని విలపించుట దక్క వేరొక్క మార్గము నాకు గోచరించుటలేదు. ఈ దాసు నెట్లు కాచెదవో యింక నీ చిత్తము నాభాగ్యము. న ... న

## ౩౦

విశ్వాత్మకా! నాయందు పసితనముననే భవదీయభక్తి బీజముల నాటితివి. నీదర్శన కాంక్షోత్సాహిని జేసితివి. నీ యాజ్ఞలకు బద్ధునిగా నొనర్చితివి. స్వాతివానకు ముత్యపు చిప్పవలె నీ కృపావృష్టికై నోరు తెరచుకొని నిరీక్షించునట్లొనర్చితివి. మేఘము లావరించినట్లు స్వప్నమును గనుచుంటినే కాని వర్షము వర్షింపదు. అనుకూల వాయువు లెప్పుడు వీచునో యెప్పుడు వర్షించునో నాకు దెలియకున్నది. న

## ౩౧

ఆశ్రిత పారిజాతా! నీచేతకాని దేదియు నిన్నాశ్రయింపలేదు. నన్ను సామ్రాజ్యాధిపునిగా నొనర్చుమని కోరుటలేదు. రూపవయోవంతునిగాజేయ యాచింపలేదు. చిరకాల జీవునిగాజేయ ప్రార్థింపలేదు. పండితునిగా జేయనర్థింపలేదు. నిన్ను నే గోరిన దొక్కటియే గదా! అది నీ వెరుగనిదికాదు. దానిని మరల మరల నానోటినుండి నీకేల వినిపింపవలెను? న...న

## ౩౨

జగద్వంద్యా! నిన్నెంతకాలము స్తోత్రము జేయవలెను? జీతబత్తెములు లేని యీ కొలువు నాకేల యంటగట్టితివి? అంటగట్టితివిపో, ఒక్కనాడైన నీ దీనునిపై నీ క్రీగంటి ప్రసారమును విడువగూడదా? అదియేమి దోసమా? నా సేవలు నీ కనంగీకారములైనచో నొక్కపరి మోమోటము విడిచి గట్టిగా జెప్పగూడదా? అయ్యో! నన్నేల రెంటికిం జెడిన రేవనిగా

జేసెదవు ? నీకీ మూకీభావము కూడదు కూడ దని గట్టిగా జెప్పుచుంటిని. న...న

33

రక్షకా! కాళ్ళబడిన పాము కరవక విడుచునా ? అట్లే నీ కాళ్ళబడిన నేను నిన్ను విడువనని యేల యెరుంగవు? నీ భక్తిబీజము నాయందంకురించిన లగ్నము స్థిరలగ్నము. ఆ లగ్న బలమును పేలవము జేయ నీ తరముగాదు. స్తుతించియో, తపించియో, శపించియో యెట్లైనను సరియే నీ కృపామృతమును పితికి తీరెదను. ఇది గర్వమనుకొనుము, మద మనుకొనుము, అహంకార మనుకొనుము వానితో నాకు బని లేదు. నాకు గావలసినది నీ కృపామృతము. దానికై నేనేపనినైనను జేసి తీరెదను. పాహిమాం. న...న

34

పుణ్యాలయా! కాల మనంత వేగమున నడచి పోవుచున్నది. దినములు, మాసములు, సంవత్స

రములు ఒకదాని వెంట నొకటి పరుగెత్తుచున్నవి. నిత్యమును, రేపు రేపని నీ కృపావృష్టికై యెదురు జూచుచుంటిని. ఇంక నిశ్శెన్ని దినములు గడప గలను? నేను మాటి మాటికి "భిక్షాందేహి" యని యాచించుట దక్క నీ నోట బ్రత్యుత్త రము వినజాలకున్నాను. అబ్బా! నీ వెంతటి మౌనివైనను ఒక్కమాటనుడువ గూడదా? న...న

౩౫

సర్వశక్తీ! సంపూర్ణమగు నీ యనుగ్రహ మును నాపై జూపి నన్ను సర్వేంద్రియ నిగ్రహ శక్తిమంతునిగా నొనర్పుము. ధర్మాధర్మ విచ క్షణలేక ప్రాకులాడుచున్న నా బుద్ధికి బుద్ధి జెప్పుము. ఏ గాలికి నాయాటయాడు గాలి పడగవలె చంచలమై పరుగులెత్తుచున్న నా మనస్సును పట్టి బంధించి చెప్పినట్లు జేయు సేవ కునిగా నొనర్పుము. అట్లు గాకున్నచో నా జీవి తము వ్యర్థమగును. ఈపాటి కృప నాపై జూపింపవే. న...న

## ౩౬

పరమపితా! నీవు తండ్రివి, నేను బిడ్డను. నే జేయు పనులలో నీ కసహ్యమైన వనేకము లుండవచ్చును. ఆ కారణముచే నన్ను దూరస్థునిగా నెట్టివేయుటకు నీమనసెట్లొప్పుచున్నది? పుత్రుల లోపములను సవరించి పోషించు భారము తండ్రులదేగదా? అట్టి వాడవు నీవే యనాదరించిన నింక రక్షించు వారెవ్వరు? తండ్రీ! నా వక్రగుణముల బోకార్చి నను రక్షింపుము. న... న

## ౩౭

భువనభర్తా! నమస్కారము. నాథా! నా జీవితము నేల మాటిమాటికి క్లిష్టపరిస్థితులలో నిరికించి పరిశీలించెదవు? నీ పరిశీలన మెక్కువైన కొలదియు నా పట్టుదల మరింత విజృంభించునే కాని నిన్ను విడువను. నీవు చేయి పట్టుకొని యీడ్చిన నేను చూరు పట్టుకొని వ్రేలాడెదనే కాని నీ కొలువుకూటమును దాటి

పోవుట వట్టి కల్ల. ఈ దాసుని విడిపించుకొనుట నీచేతగాని పని. రవ్వంత నీనామామృత రసాయనమును చవిగొన్న భక్తుడు, అల్పమో, అత్యల్పమో నీ ప్రపత్తి యోగము ననుష్ఠించిన సాధకుడు, విదిలించిన మాత్రముననే నిన్ను విడుచునను కొంటివి గాబోలు? ఎంతటిమాట! దాసుని విడిపించుకొనుట నీ తరముగాని పనియని నీ వెరుంగవు గాబోలు? న...న

## ౩ర

కల్మషరహితా! నీ దివ్యలీలల దెలిసికొని నిను నుతించుటకు ప్రహ్లాదాది భక్తబృందమే చాలనప్పుడు, నే నెంతవాడను? ఎప్పుడో జన్మింపబోవుశిశువులకప్పుడే స్తన్యమును నిర్మించియుంచు చుంటివి. శిలాగర్భమున నున్న కప్పకు జీవనాధారమగు ఆహారపానీయముల నాస్థలముననే సృష్టించుచున్నావు. ప్రావృట్కాలము వచ్చియు రాకమునుపే సర్వసస్యోపయోగమగు వర్షమును గురిపించు చున్నావు. ఆహా! నీ లోకసేవ వర్ణనాతీతము. నీ ప్రేమ నిరుపమా

నము. నీ వాత్సల్య మనంతము. నీ కీర్తి యజరామరము. న...న

## ౩౯

సుగుణనిధీ ! ఏ దిక్కు బరికించినను నాకా ధారభూతము నీ వొక్కరుడవె దక్క వేరెయ్యె దియు గాన వచ్చుటలేదు. ఈ భావము నా నాటికి వేరూని నాటుకొనుచున్నది. బంధు వులు గలరు, మిత్రులు గలరు, భృత్యులు గలరు. కాని యీ బంధుమిత్రాది నామములు మా యా కల్పితములే కాని వాస్తవములని తోచుట లేదు. వారివల్ల నా కయ్యెడి కార్యములు మృగ్యములు. నాధా ! శరణాగతుడను. పాహి మాం పాహిమాం. న...న

## ౪౦

పరమేశ్వరా ! నీ చేయు కార్యములు మాబోంట్ల కూహాతీతములు. ఏకార్య మెందు లకు జేయుచుంటివో యూహింప నశక్యము.

అస్మదాదుల బుద్ధి కొకప్పుడు సౌఖ్యవంత
ముగా గోచరించు నీ చెయిద మొకప్పుడు
భయంకర కష్టాంతముగా బరిణమించుచున్నది.
మరి యొకప్పుడు, భయంకర కష్టములతో
ప్రారంభమైనట్లు తోచెడి కార్యము పరిపూర్ణ
సౌఖ్యాంతముగా బరిణమించు చున్నది. ఆరంభ
మొకరీతిగ ముగింపు మరియొక రీతిగ నెందు
లకు జేయు చుంటివో, యెవ్వరి కెరుక ? ఈ
తర్కములతో నాకేమిపని, నీవెట్లు జేసిన నట్లు
సంచరించుటయే నాపని. న...న

## ౪౧

శ్రీ అజ్ఞానతిమిరభాస్కరా ! జోహారు. ఒక్కొ
క్కప్పు డజ్ఞాన మనెడు కారు మబ్బులు
దట్టమై పెనుగొండలవలె వ్యాపించి యంధకార
బంధురముగా నొనరించు చుండును. మరల
వెనువెంట నీనామసంకీర్తన మనెడు ఝుంఝూ
మారుతము సోకి నంతనే తన్మేఘములు దూది
పింజలవలె దిక్కులకు బరుగు లెత్తుచు వెలుగు

నొసంగు చుండును. స్వామీ! యీ నిమ్నో న్నత స్థానమునబడి నే నిక నడువ జాలను. నా నాటికి నాసామర్థ్య మడుగంటు చున్నట్లున్నది. నాకు శాశ్వత జ్ఞాన జ్యోతి నొసంగి నన్ను దీవింపవే. న...న



౪౨

చిత్రరూపకా! దిక్కు లంధకార బంధుర ముగా నున్నవి. మార్గమును తెలిసికొన జాల కున్నాను. కాలు కదల్ప లేకుంటిని. వెలుగు జూపించెడి యాత్మీయు లెవ్వరును లేరు. ఇయ్యది నాకు ప్రళయకాల రాత్రివలె యత్యంత భయం కరముగా నున్నది. హృదయము బ్రద్దలగు చున్నది. నా లోని చైతన్యము పూర్తిగా నశించి పోయిన ట్లగపడుచున్నది. నాధా! నా కిం కేది తెరవు? నేనీ యంధకారమున సమసి పోవలసినదేనా? యెంతకాలమిట్లు పగ జూపె దవు? యెప్పటి కీ నిర్భాగ్యుని దరి జేర్చు కొనెదవో? న...న

## ౪౩

భక్తచింతామణీ ! నన్నాదరించి చులుకన జేయకుము. లోకము నన్ను జూచి నవ్విన నవ్వుగాక. వ్యర్థునిగా భావించిన భావించుగాక. అయోగ్యుడనని యెంచిన యెంచుగాక. వానితో నాకు బనిలేదు. సకల శుభ ప్రదాయకుడవు, సమస్త జ్ఞానదాతవు, నీవుంటివని నీపై గొండంత యాస బెట్టుకొని కాలము గడుపుచుంటిని, నీటముంచెదవో పాలముంచెదవో నీ చిత్తము. న...న

## ౪౪

జగన్నాతా ! దీనజనరక్షకుడవను నీ కీర్తి దిగ్దిగంతములకు వ్యాపించి గింగురుమని ప్రతిధ్వనించుచున్నది. అట్టి నీ కీర్తి గీతముల విని యుండుట చేతనే యేనాటికైనను నీ కృపారసమును గ్రోలగలననెడి పేరాసచే జీవించుచుంటిని. కాలవిలంబనమైన కొలదియు నా యాసలడుగంటుచున్నవి. స్వామీ ! నీ కీర్తి చరిత్ర విశ్వసనీయము కాదా ? అయినచో నన్నేల

రక్షింపవు? నూరు నోముల ఫల మొక్కరంతుతో బోయె నన్నేట్లేల జేసెదవు? తండ్రీ! దరి జేర్పుము. ఇంకను నిరీక్షించుట నా చేతగాని పని. చేతనైనంత వరకు నిరీక్షించితిని. అబ్బా! యింకను కాలయాపనమా! చాలుచాలు. న...న

## ౭౨

ఆపదుద్ధారకా! నీ కృపారసమును చవి జూడని యీ దుర్భర జీవితము నింక సాగింప జాలను. సాగించెదనుపో యీ నిర్భాగ్య జీవిత మే పరమార్థమును సాధింపగలదు? నిరంతరమును, చివికి జీర్ణించుచున్న హృదయముతో ప్రోషితభర్తృకవలె యింకెన్ని నాళ్లిట్లు కృశించి జీవింపగలను? నాథా! యీ జన్మమున నింక నీ ప్రణయాలింగన సౌఖ్య భాగ్యము నాకు లేనే లేదా? అయ్యో! యిట్టి నిరర్థక జన్మమేల యెత్తించితివి? న...న

## ౭౩

స్వామీ! నీ కొరకు నిరీక్షించి నిరీక్షించి నా గ్రుడ్లు గ్రుంగి పోవుచున్నవి. నిను గీర్తించి

కీర్తించి కంఠము సన్నగిల్లుచున్నది. నీ ప్రణయామృతపానమునకై గ్రుక్కిళ్ళు మ్రింగి మ్రింగి నో రెండుకొని పోవుచున్నది. అబ్బా! యింకెట్లు నిన్ను వశీకరించుకొందును. నాథా! యని విలపించుట దక్క నిను వశీకరించుకొను నూతన తంత్రము లేవియు నే నెరుగకుంటి నే. అక్కటా! నే నేమి చేయగలను ? నోటిలో నుంచుకొన బోవు ఫలము నీటిలో బడినట్లైనది. న ... న

౪౭

జగన్నియంతా! ప్రపంచమున దైవోపహతుడైన దాసుడు కూడ గలడా ? యెంత కాలము నిన్ను యాచించినను ఫలము గానక విలపించుచుంటి నే, యిట్టి యాశ్చర్య మెందైన గలదా ? ఇచ్చెద ననిగాని యీయ ననిగాని నుడువక త్రిప్పుచుండెడి దాత యెక్కడనైన గలడా ? ఇట్టి విపరీతపరిణామము నీ యందేల యంకురించినది ? అక్కటా ! నా పాపమంతటి కఠినతరమైనదా ? అయ్యయో ! నే

నింకేమి చేయగలను ? యెట్లు మనగలను ? నాకు దిక్కు జూపింపవే! న...న

౪౭

ధర్మరూపా ! నానాటికి నాకు నా శక్తిపై విశ్వాసము పూర్ణముగా నశించి పోయినది. నాకే కార్యసాధనకైనను శక్తి నీవలన వచ్చు చున్నది. ఆహారము నీవలన నుద్భవించు చున్నది. సౌఖ్యము నీ వలన కలుగుచున్నది. కీర్తి నీవలన బయలుదేరు చున్నది. ఇందేదియైనను యేనాడు నాది యని భావించెదనో ఆ నాడే నే నశక్తుడనై పోవుచున్నాను. దీని కింత కన్న వేరు సాక్ష్యమేమి కావలెను ? తండ్రీ ! బుద్ధి వచ్చినది. సమస్తమును నీదియేకాని నా చేతనైన దెద్దియును లేదు. న...న

౪౮

ఈశ్వరా ! నీ జగన్నాటకశాల యందు నన్నొక పాత్రధారినిగా జేసితివి. నీవు చెప్పిన ట్లాడు చున్నాను. ఎంత కాల మాడించినను

హాస్యపాత్రగా నాడించుచుంటివే కాని యుత్తమ పాత్రధారణాభాగ్యము నాకు లభింప జేయ కుంటివి. ఆడిన యాటయే మరలమరల నాడు టకు విసుగెత్తు చున్నది. ఇంక నీ పిష్టపేషణ మును నే జేయజాలను. నూతనత్వాభిరుచి మెండగు చున్నది. ఈ యుద్యోగము నుండి నన్ను దొలగింపవే. న...న

## ౫౦

భవతరణా! నన్ను సంసారారణ్యములో దిగవిడచితివే కాని నే నెట్లుంటినని యొక్క నాడైన బరామర్శింపవు. అక్కటా! యెటు జూచినను ఘోరారణ్యము, ఏ వైపు చూచినను కరకురాళ్ళు, ఏ దిక్కు జూచినను ముండ్లపొదలు, ఏ వంక జూచినను క్రూరమృగఘీంకారములు, అయ్యయో! ఒక వైపున కార్చిచ్చు గ్రమ్ము కొని వచ్చు చున్నది. బైట బడుటకు మార్గము లేదు. ఇంక నీనామసంకీర్తనమే నాకు శరణ్యము. న...న

## ౯౧

సర్వేశ్వరా! నిన్నెలుగెత్తి యాహ్వానించుటేగాని, నీకు స్వాగత మిచ్చి పూజించుటకు దగిన వస్తుసముదాయ మెద్దియును నావద్ద లేదు. నాథా! నీ యాగమనకాలమున నేను నీ కిచ్చు బహుమానము హర్షాశ్రు బిందువులు. నీ కొరకు గల్పించు వినోదము లున్మాదనృత్యము, గద్గదరుతితో గూడిన భవదీయ నామసంకీర్తనము, పులకితదేహరోమాంచము. ఇవియే నే జేయగల సపర్యలు. వీని నాదరించెదవో యనాదరించెదవో నీ చిత్తము. న...న

## ౯౨

శాంతమూర్తీ! ఇంక నీదయ నెన్నటికిని సంపాదింపలేనని గట్టి నిరాశ జేసికొందమన్నను నాటి నిద్రావస్థలో విస్పష్టముగా దర్శించిన నీ యభయహస్తము నన్ను నిరాశ జేసికొన నిచ్చుటలేదు. నాథా! నాటి నీ సందర్శనము తళుక్కున మెరపు మెరసి నట్లాయెనే,

అక్కటా! నాడు నే నేల గాఢ నిద్రా పర
వశుడనై యుంటిని. రవ్వంత జాగ్రదవస్థలో
నున్నచో నా బాహుపాశములతో నిన్ను గట్టి
వైచి యుందునుగదా! ఆ సమయమున నీ
మాయ నన్నేల గప్పవలె? అయ్యయో!
నిర్భాగ్యుడనైతిని. రక్షింపవే. న...న

౫౩

అవాఙ్మానసగోచరా! భవదీయ పాద
భక్తిని సంపాదించిన భక్తున కెందైన నపజయము
గలదా? అట్టి చరిత్రను నే నెన్నడును విని
యుండలేదే? అట్లయిన నేను మాత్రము నిరాశ
జెందనేల? నిశ్చయముగా నే నేనాటికైనను
నీ కృపారసమును గ్రోలి తీరెదను. అది దాచి
యుంచుట నీ వలన గాదు. నా పరితాపాగ్ని
జ్వాలలు బయలుదేరి నీ చుట్టు ముట్టినప్పుడు
నీ వెట్లు చలింప కుండెదవో చూచెదగాక. న...న

౫౪

విశ్వోపాస్యా! నీ యుపాసనా బల
మమోఘమని గట్టిగా నమ్మి యుండుటచేత నే

యింతవర కెట్టి కష్టములైనను లెక్క జేయక కాలమును కందుకమువలె దొర్లించి వైచితిని. ఇప్పుడాకాల మేలనో వెనుదిరిగినది. దీనికిం దగిన యుపాయము మరి యొక్కటి నాకు గోచరించుటలేదు. ఎట్టి కష్టముల యందైనను నాథా! యని నిన్నెలుగెత్తి పిలచి నా కష్ట సౌఖ్యముల నీకు విన్నవించి యిన్ని కన్నీళ్ళు నీ కర్ఘ్య మిచ్చి నంతనే నా భారమంతయు జారిపోయి నట్లయ్యెడిది. నేడు నా కా యుపాసనాబలములేదా? లేకున్న నాసౌఖ్యమున కిది చరమదశయా? నా జీవితచరిత్రకు ఫలగ్రంథ మిట్లు రచించియుంటివా? అక్కటా! నిన్ను విడచి మరెవ్వరి బ్రార్థింపవలెనో నాకు దోచకున్నది. ఇంక నీ జీవచ్ఛవము నేమి జేసికొనెదవో నీ చిత్తము. న ... న

౧౬

ఆనందమయా! సారవిహీనములైన యీ సమస్త కార్యములకు స్వస్తిజెప్పి సర్వకాల సర్వావస్థలయందునను త్వదీయ పాదసేవ జేసి

కొనుచు బ్రహ్మానంద సాగరమున నోలలాడున ట్లనుగ్రహింపుము. ఇప్పుడు నాకెన్నియో నిరుప యోగముల ని. అనర్థకములని తోచెడి కార్య ములు బలవంతముగా నామెడకు పాశములవలె జుట్టుకొను చున్నవి. తండ్రీ! అట్టివానిని నాదరి జేరనీయకుము. న...న

౫౬

విశ్వసృజా! నీచే సృజింపబడిన యీ యనంత ప్రపంచమునం దీదాసు డొక్కడే నిరుపయోగి వలె గన్పట్టుచున్నాడు. కామ్యకర్మ గానిమ్ము, నిష్కామ్యకర్మ గానిమ్ము, యేదియో యొకటి చేయక తప్పుట లేదు. అది యెందులకు జేయు చుంటినో నాకర్థమగుట లేదు. చేసెడికర్మయందు నాకుత్సాహము లేదు, దృష్టి లేదు. ఇది యెందు వలన నిట్లు జరుగుచున్నదో నాకు తోచక యొక్కొక్కప్పుడు గజిబిజి పడుచుందును. కర్మ పరతంత్రుడను గాకుండనుండలేను, దాని నుత్సా హముతో జేయజాలను. తండ్రీ! యీసంకటస్థితి నెడబాపవే. న...న

## ౫౭

ఆ శ్రీహరా! ఒక్కొక్కప్పుడుత్సాహముతో, గట్టిపట్టుదలతో, అత్యంత ధైర్యముతో నాధ్యాత్మికజీవనమనెడు పర్వతాగ్రముపై నెక్క బ్రయత్నించుచున్నాను. వేవేగమున గొంతవర కెక్కి కాలుజారి పడుచుంటిని. శిలాఘాతములచే నొడలంతయు రక్తమయమగుచున్నది. శరీరములోని ప్రతిభాగమును నలిగిపోవుచున్నది. తిరిగి మొదటి సోపానమునకు జేరుకొనుచున్నాను. విసుగుజెందక మరల ప్రయాణమును సాగించుచున్నాను. తిన్నగా కొంతవర కెక్కునప్పటికి కంటకావరణము ముందునకు బోనిచ్చుట లేదు. విసివి వేసారి చచ్చుబడిన పాదములతో మెల్లగా జారిజారి యెచ్చట బయలుదేరితినో యచ్చటికి జేరుకొనుచున్నాను. ఈ తీర్థయాత్ర నింక నిర్విఘ్నముగా సాగించుట కుపాయము నాలోచింపవే. న...న

౫౭

ఆద్యంతరహితా! నీ కాద్యంతములు లేన ట్లులే నాపాపఫలమునకు గూడ నాద్యంతములు లేవా? ఉన్నచో నీకృపారస పానమునకై యింత కాల మేల నిరీక్షింపవలసి యుండును? నిజముగా నీవు నావాడవైనచో నా పాపములతో నీకు పని లేదు. ఇదివరకెందరి పాపులను నీవు దివ్యులనుగా జేయగలిగి యుండలేదు? నాపాపమంతటి హేయ మైనదా? నాథా! యింక నేనీ యాలస్యమును సహింప జాలను. నీ ప్రణయామృతము నొకుక్క మ్మడీ గ్రుమ్మరింపవే. న...న

౫౮

భక్తజన పరతంత్రా! నిన్ను మెప్పించి వశీకరించుకొనుటకై నీవు నాకొసంగిన సర్వశక్తు లను, సకలోపాయములను, వినియోగ పరచి ఫలముగానక విలపించు చుంటిని. ఇంతటితో నీ సేవ మానుకొనెదమన్న నా యంతరాత్మ దాని కంగీకరించుటలేదు. తిరిగి వేరొక యుపాయ

మాలోచింప జాలక ముగ్ధుడనై పోవుచుంటిని. హృదయావేగము చెప్ప నలవిగాకున్నది. దాసో హమని పాదముల బడుచుంటిని. అణగద్రొక్కి తివా, నీపాదఘాతముచే పవిత్రుడనయ్యెదను. లేవనెత్తితివా, నీ శీతలకరస్పర్శానంద మనుభ వించుచు సౌఖ్యసామ్రాజ్యము నేలగలను. న...న

౬౦

దాసపోషకా! దాపరికము లేక నాజీవితా వస్థ నంతయును నీకు విశదీకరించితిని. ఇంక చర్వితచర్వణమును జేయజాలను. చేసిన ప్రయో జనమేమికలదు? నిరంతరమును కుక్క మొరగి నట్లు మొరగుచున్నచో నీకేమి కోపము గలు గునోయని భయమగుచున్నది. ఇంక నీదాసుడు మార్గము నెరుగని గ్రుడ్డివానివలె, ఉపాయమెరు గని మూఢునివలె, మాటలురాని మూగవలె, భావములేని స్థాణువువలె నిలువవలసినదేనా? అన్యాయ మన్యాయము. న...న

౬౧

ప్రభాకరా! నాభక్తిని పరిశీలింపనెంచి, నా

శీలమును సవరింపనెంచి నన్ను మాటిమాటికి సంకటావస్థలో నిరికించుచుంటివి గాబోలును? నీ యగ్నిపరీక్షకు నేనింక తాళజాలను. నీకృపా రసపానమునకై క్షణమొక మహాయుగముగ గడపుచుంటిని. ఈ ప్రతిక్షణమహాయుగముల గడపుటకింక నాకు శక్తిలేదు. నానాటికి నాకీ నిస్సార జీవితముపై రోత పుట్టుచున్నది. ఇంతటితో నా జీవితమును పరిసమాప్తి నొందించినను ధన్యుడ నయ్యెదను. న...న

## ౬౨

అవ్యయా! నా హృదయ సింహాసనమున నిన్ను బ్రతిష్ఠించుకొంటిని. నే జేయు సమస్త కార్యములు నీకు విన్నవించుకొను చుంటిని. నీ యాదేశ మెట్లువచ్చిన నట్లు జేయుచుంటిని. నీ యాజ్ఞకై నిరీక్షించుచుంటిని. సర్వవిధముల నిన్ను మెప్పింప బ్రయత్నించుచుంటిని. దుర్బలుడను, ఇంక నేనేమి చేయ గలను నా శక్తి నీ వెరుంగనిది కాదు. చచ్చినవానితో సల్లాపము లాడెదవేల? న...న

౬౩

వరదా! నిను నమ్మినందులకు ఫలముగా గంభీరహృదయముతో కష్టసహిష్ణుడనై జీవించు నట్లు వరమిచ్చి యుంటివి. అందుచే నాయందే యెన్ని కష్టములనైన ద్రోయుదువుగాని, నేనే తమ సౌఖ్యసాధన వస్తువునని నమ్మియున్న వారలకు మాత్రము నావలన గష్టములు కలుగకుండున ట్లనుగ్రహింపుము. ఆపాటి యనుగ్రహము నీవు చూపించినచో పిమ్మట కష్టము లనుభవించుటకు నే నుంటిని. కాచుటకు నీవుంటివి. తుదకెట్లైన నట్లౌగాక. న...న

౬౪

నిరంజనా! దినదినమును నాహృదయస్పందన మత్యంత మగుచున్నది. పని చేసి చేసి యలసటచే నెప్పుడో హఠాత్తుగా నాహృదయ మాగిపోవున ట్లగపడుచున్నది. నాథా! యింక నీ ప్రణయసౌఖ్యమునకై నిరాశ చేసికొనవలసిన దేనా? కానిమ్ము, ఆఖ్యాతిని నీవే సంపాదించుకొనుము. నేను మాత్రము పరమేశ్వరుడు చేసిన

బైరాగినని వాడవాడల దిరిగి చాటించి చెప్పె
దను. ఈ దుష్కీర్తి నెట్లు బాపుకొనెదవో
చూచెదగాక. న...న

౬౫

భవవిదూరా! ఎంతటి దూరదృష్టికైనను
తుద మొదలు కనుపింపని భవసాగరమున శరీర
మనెడి ఈయోటినావపై నెక్కి ప్రయాణమును
సాగించుచున్నాను. ఈ యోటినావ తప్పు
గాలిచే వెల్లికిలబడి మునిగిపోవునో, సముద్ర
గర్భముననున్న పర్వతాగ్రమునకు డీకొని బద్ధ
లగునో తిమింగిలములచే మ్రింగబడునో,
ప్రచండవాయు పీడితమై యాకసమునకే లేచునో
యని భయమగుచున్నది. వెనుదిరుగుదమన్న
మార్గ మగుపించుట లేదు. తండ్రీ! యీవిధమున
నరచేతిలో ప్రాణము లుంచుకొని యీ సముద్ర
యానము నింకెంత కాలము జేయగలను?
అక్కటా! నాకింక సౌఖ్యమార్గమును రూపిం
పవే. న...న

౬౬

నిరుపమానా! ఒక్కొక్కప్పుడు నీ కృపా కటాక్షములు కమ్మతెమ్మెరవలె నన్నలముకొని నన్ను భావించి ప్రమత్తుడనై స్వర్గసుఖ మనుభ వించు చుండును. మఱియొకప్పుడు నీ దయా రసములేని మరుభూమిలో జిక్కుకొని నీ తీక్ష్ణ దృక్కులనెడు ప్రభాకర జ్వాలలలో దగ్గ మసియై పోవుచున్న ట్లగపడుచుండును. ఇది యేమి భ్రాంతియా, స్వప్నమా, లేక సత్యమా? నాథా! నీ లీలలు నిరుపమానములు. నీతత్త్వమును నే నెరుంగజాలకున్నాను. న...వ

౬౭

నిత్యా! నీ యౌదాసీన్యము నన్ను నానా టికి మఱింత బాధపెట్టుచున్నది. నేను ప్రార్థిం చిన కొలదియు నీవు పెడమొగము బెట్టు చున్నావు. అన్నా! యిదియేమి యాశ్చర్యము? నీవు భక్తసులభుడవని నమ్మిగదా నీ మరుగు జొచ్చి నీపాదములపై బడితిని? నీనిర్గుణత్వము

మొత్తముగాజేసి నాపైననే ప్రయోగించితివా? ఇంక నీ గడుసుదనమును గట్టిపెట్టి నాప్రార్థన నంగీకరించి నను కృతార్థునిజేయుము. అట్లు కాకున్నచో భక్తహృదయమున నింక నీకు స్థానమేలేదు. న...న

౬౮

నిగమవినుతా! నీ కల్యాణ గుణము లను నిగమములు వినుతించుచున్నవి; ఋషులు కీర్తించుచున్నారు; భక్తులు పాడుచున్నారు. వారితో గలసి నీ ప్రణయ కథాగీతముల నుచ్చై స్వరమున గీర్తింపవలెననెడి యభిలాష మెండుగా నున్నది. నాథా! సంపూర్ణానుభవము లేని నేనెట్లు నీ కీర్తిగీతముల బాడగలను? ఈ కోరిక వ్యర్థమని నీవు భావించెదవా, నాజీవితమును వ్యర్థము కాగలదు న...న

౬౯

నిశ్చయా! నిన్నటిదనుక నీకృపారస దాన మునకై నిన్ను యాచించి యాచించి నా ప్రాణము విసుగు జెందినది. ఎందువలననో

నీవు నాపట్ల లుబ్ధుడ వైతివి. ఇంక నీ లుబ్ధత్వము నుపేక్షించి యుండ జాలను ఇదిగో యీ క్షణముననే నీతో యుద్ధ మొనర్చి నిను జయించి, నీవద్దనుండి నాకు గావలసిన సామగ్రిని కొల్లగొట్టి భక్తలోకమునకు బంచి పెట్ట బద్ధకంకణుడ నగుచున్నాను. కాచుకొమ్ము. నేనే జయించెదనో, నీవే జయించెదవో, చూచెదవుగాక. న...న

20

లోకగర్భా! నిజముగా నీవు నాకు ఋణపడియుండలేదని నావంక మోమెత్తి చూచి రూఢిగా జెప్పగలవా? లేదు లేదు; నీకట్లు పలుకుట కధికారములేదు నేను నీవద్ద దాచుకొనిన నా కష్టార్జితధనమును నీవద్ద నుంచుకొనుటకు నీ కధికార మెక్కడిది? ఈ యాగడము నింక సాగనీయను. నా ధనమును నేను వడ్డితో గూడ నీవద్దనుండి కొల్లగొట్ట బోవుచున్నాను. అప్రమత్తుడవై కాచుకొమ్ము పిమ్మట జయ మెవరిదో నీనోటనే పలికింపగలను. న...న

౭౧

పరాత్పరా! ఇదిగో గురూపదిష్టమగు భక్తి సమ్మోహనాస్త్రమును పునశ్చరణ గావించి నీపై బ్రయోగించుచున్నాను. ఇప్పటికైనను న్యాయము వంకకు దిరిగి నావస్తువును నాకిమ్ము. లేకున్న నా యస్త్రప్రయోగముచే నిన్ను సమ్మోహితుని జేసి నీసర్వస్వమును కొల్లగొట్టి తీరగలనని శపథముజేసి చెప్పుచున్నాను. ఇంకను మరియొక గడవిచ్చుచుంటి నాలోచించుకొనుము. న...న

౭౨

సన్నుతా! ఇయ్యదే, నాకఠిన వాక్శూలములచే నీ హృదయమును గ్రుచ్చి, ఒక్కుమ్మడిగా నా నమస్కార బాణముల నీపాదములపై బ్రయోగించి నిలిచినచోటునుండి నిను గదలకుండజేసి, అస్మత్తీవ్రవాంఛాపాశములచే నిను బంధించి, విషయవాసనలచే నిండుకొనియున్న మదీయ హృదయాంతరాళమును బరిశుద్ధ

మొనర్చి తదంతరమున నిను బంధింప బోవు చున్నాను. జయమెవరిదగునో విచారించు కొనుము. న...న

## ౭౩

లోకాతీతా! ఇంతకాలమునుండి నాకు దెలియకుండ నాయింట దిని యింటివాసముల లెక్కబెట్టుచు మన యుభయుల మధ్యను భేదో పాయమును నిర్మించుచున్న కామక్రోధాదుల నొక్కదెబ్బతో బారద్రోలి శాంతి శమ దమాదులనెడు నమ్మకమగు కాల్బలమును సేక రించుకొని బయలుదేరి యచంచలదీక్షితుడనై నిను గెలువ నుద్దేశించుచున్నాను. జయమెవ రిదో యోచించుకొనుము. న...న

## ౭౪

త్రిగుణాతీతా! నీతో సమరమొనర్ప సర్వ సన్నాహము గావించి ప్రస్థానభేరి ప్రయోగించు నప్పటి కా ప్రమోతచే యెందువలననో నా యొడలు కంపించుచున్నది. చిత్తస్థైర్యము తప్పి

పోవుచున్నది. భూమండలము గిర్రున తిరుగు చున్న ట్లగపడుచున్నది. నాథా! నా సాహసమును క్షమింపుము. జయమెవరికైనను కానిమ్ము. నీతో సమరమొనర్చుటకు మాత్రము నామన మిచ్చగింపకున్నది. నీవు నన్నెన్ని జన్మము లెత్తించినను సరియే, యెన్ని యిక్కట్టులపాలు జేసినను సరియే, నేను నీవాడనని యాత్మార్పణము జేయుచుంటిని. వీని నింక కాచెదవో కాల్చెదవో నీచిత్తము. న...న

౭౫

కోమలరూపా! జన్మజన్మముల యందునను నన్ను నీపాదసేవకునిగా నంగీకరింపుము. ప్రతిక్షణమును నీపదభక్తి కలిగియుండున ట్లాశీర్వదింపుము. నా జీవితకాలములో నొక్కక్షణమైనను వ్యర్థముగా వినియోగపరుపకుండునట్లు వరమిమ్ము. నీ సఖ్యమే నామూలధనము. నీ ప్రేమయే నాభాగ్యము. నీ క్రీగంటి ప్రసారములే నా సమస్తాభరణములు. నాథా! నాకింతకన్న వేరేమి కావలెను? న...న

## ౨౩

కామితఫలప్రదా! కానిపోని నేరముల నాపై నంటగట్టి నన్నేల హింసించెదవు? కావు కావుమని కాళ్లబడుచుంటిని. గ్రచ్ఛపాదవలె నున్న నాపాపముల నొక్కొక్కటిగా బైటకులాగి నన్ను కఠినతరముగా శిక్షించుచున్నావు. చేసిన పాపములకు పరితాపపడి ప్రార్థించు భక్తుని రక్షించుటకు నీ కధికారము లేదా? దయరాదా? రక్షింప నీచేతగాదా? లేకున్న మరణమైనను ప్రసాదింపరాదా? న...న

## ౨౨

స్వప్రకాశా! నీ వియోగావస్థ యెక్కువైన కొలదియు నీ దర్శనకాంక్ష మరింత మిక్కుటమగుచున్నది. నీ కృపామృతము దూరమైన కొలదియు నాకు దానిని ద్రావవలె ననెడు దాహ మధికమగుచున్నది. ఇదియేమి! నీమాయయా! లేక యింద్రజాలమా! లేకున్న నాకభావవైరాగ్యమైనను గలుగకుండునా? పొంద

రాని వస్తువని నిరాశ జేసికొన జాలకున్నాను. నాథా! యీ యడియాసలతో గ్రుక్కిళ్ళుమ్రింగి కొనుచు నే నెంతకాలము మనగలను? ఈ వైరముతో నన్నెంతకాలము బాధించెదవు? నమ్మితిని, నట్టేట ద్రోయుదువో, నమ్మకముగ బ్రోచెదవో నీచిత్తము. న...న

## ౭౫

అద్వితీయా! వెనుకకు బోయిన గొయ్యి, ముందరకు నడచిన నుయ్యివలె నున్నది నాజీవితావస్థ. ఒకవైపున భవసాగరమున బడి యీదులాడుచున్నాను మఱియొకవైపున నిరంతరము నీ పాదభక్తిలో మునిగి జీవితమును సౌఖ్యవంతముగా జేసికొన బ్రయత్నించుచున్నాను. ఇందు దేనియందునను నాకు సంపూర్ణ పాండిత్యము కుదురలేదు. ఈ రెంటియం దేదియైన యొకటివిడిచి యొక్క దానినే యాశ్రయించుదమన్న నాకు శక్తి చాలుటలేదు ఈ యసిధారావ్రతమును సాగించుటకు భయమగుచున్నది. ఇకనైన నన్నుగ్రహింపవే. న...న

౭౯

పురాణపురుషా! నీ హృదయాంతరద్వారమును దెరచి దానిలో రవ్వంత తలదాచికొనుటకు నాకు తావిమ్ము. అక్కటా! యెంత కాలము నే నీవీథియరుగులపై వర్షాతపబాధలనుభవించుచు బడియుండగలను? నాథా! నాకు విసుగెత్తుచున్నది, యిక నేనీబాధను సహింపజాలను. చూచిచూచి యెప్పుడో హఠాత్తుగా తలుపులు బ్రద్దలుగొట్టి లోన బ్రవేశింపగలను. పిమ్మట నేమి చేసెదవో చూచెదగాక.
న...న

౮౦

ద్వంద్వరహితా! సంపద్విపత్తులయందున కీర్త్యపకీర్తులయందున దూషణలయందున నొక్క విధమగు నానందమును నా కొసంగుము. కష్టము వెనుక సౌఖ్యమును, సౌఖ్యము వెంట కష్టము నున్నదని నాకిప్పుడిప్పుడే సంపూర్ణముగా బోధపడినది. ఈజ్ఞాన సారమును మరువక వర్తించి

సుస్థిరముగా హృదయమున చిత్రించి యుంచు కొను నట్లాశీర్వదింపుము. న...న

౮౧

అజరామరా! ఆశావృక్ష మొక్కొక్కప్పు డవనిపై గూలి రూపనాశమగుచున్నది. పోయి నట్టులే పోయి మరల నొక్క పెట్టున వెదురు మోసువలె నెదిగి యాకసమున కంటుచున్నది. మరల పెనుగాలిచే నయ్యది నేలగూలుచున్నది. మూలము నశింపదు. వృక్షము సాంతముగా నెదిగి ఫలముల నొసంగదు. ఈ విధమున సిద్ధాన్నమును చేతులార చిందర వందర జేయుచుంటిని. నా నిర్భాగ్యతకు నిన్నే మనగలను? ఇంక నీ యిష్టము వచ్చినట్లు జేయుము. న...న

౮౨

నిరామయా! నీ వైపునకు దృష్టిని మరలించు కొంటివేకాని నిజమైన సౌఖ్యము నొసంగక యిడుమల బెట్టుచున్నావు. నీ యాశ్లేషానంద మనుభవించుటకు నే నధికారినిగానా? నేనేమి పగవాడనా? భరింప రానంతటి పాపా

త్నుడనా ? అక్కటా ! రాచి రంపమున గోయు చుంటివి. ఇదియేమి యన్యాయము ? నమ్మితి నని మ్రొక్కుచుంటిని; నాశన మగుమని యాశీర్వదించు చుంటివి. అయినను నేను నిరాశుడ నగుట లేదు. కానిమ్ము ముందేమి చేయ నుంటివోగదా ? న...న

## ౮౩

నిత్యపరిశుద్ధరూపా ! నీవు నాకు రూపించిన నియత మార్గముల నెఱుంగ జాలక మోస పోతిని. పరమ సౌఖ్యమని యెంచి భవరోగముల పాలయితిని. పీయూష మను భ్రాంతిచే విషము ద్రావితిని. మున్నీరను మోహమున మురికి కూపమున స్నానమాడితిని. చేసినవి తప్పులని చేయు చున్నవి పాపములని తెలిసికొనియు, కుమార్గములనుండి తప్పించుకొని రాజ వీథుల సంచరించుటకు నా కింకను శక్తి చాల కున్నది. ఇది యేమి యన్యాయము ? నాథా ! నేడు సుదినము. దినము లన్నింటి కంటెను యేదిపవిత్ర తమమని, యేది యుత్తమోత్తమమని త్రికరణ

శుద్ధిగా నమ్ము చుంటినో యట్టి శుభదినము నేడే కదా? ఇట్టి శుభ సమయముననే, నాయందలి లోపముల రూపడంచి నాకు సౌఖ్య జీవన మొసంగి నను గృతార్థుని జేయుము. శుభలగ్న మును వమ్ము జేయ సంకల్పింపకుము. న...న

౨౮

నిరుణా! నీ కృపారసమునకై దుఃఖించి కన్నీళ్ళు గార్చిన కొలదియు నేత్రములు ప్రఫుల్లము లగుచున్నవి. నిను గూర్చి యుద్వేగమాన సుడనైనకొలదియు హృదయము వికసించు చున్నది. నీ దర్శన కాంక్షచే సంతప్తుడనైన కొలదియు శరీరము శక్తిమంత మగుచున్నది. అహో! యేమి చిత్రము! సామాన్య విషయముల యందనుభవించు శ్రమలకే ఫలము నొందు చుంటిమో, అట్టి ఫలితమునే యాసంగగల కష్టముల నీ విషయమున బడినప్పుడు వానికి వ్యతిరేక ఫలముల నిచ్చుచున్నావు. కష్టమను వస్త్రమును పైగప్పు చున్నావు. పరిశీలించి చూచు కొను నప్పటి కా చేలాంచలమున సౌఖ్య మను

మూట చేతికి దొరకుచున్నది. దానిని విప్పి యనుభవింప లేని వారంధులు, మూఢాత్ములు, నిర్భాగ్యులు. నాథా! అట్టి యంధత్వమును నాకు కలుగ నీయకుము. న...న

## ౮౫

సర్వసాక్షీ! సంసరణ సాగరమున మునిగి యీదులాడుచున్న నాకతాత్తుగా భవదీయ పాదభక్తి యనెడి నావ చేతికి దొరకినది. ఆ నావలో ప్రయాణమును సాగించువాడను నేను, చుక్కాని త్రిప్పువాడను నేను, తెడ్లు వేయువాడను నేను, తెరచాప యెత్తువాడను నేను, ఈ విధముగా నసహాయుడనై పడవ నడుపుకొనుచుంటిగాని యెంత కాలము ప్రయాణ మొనర్చినను తీరమును జేరజాలకున్నాను. ఎప్పటికైన నీ నావచే దరి జేర గలననెడి ధైర్యము మాత్రము నాకున్నది. న...న

## ౮౬

జగత్కారణా! సమస్తమునకు గారణ భూతుడవైన నీవు, బధిరునివలె నే నెంత ప్రార్థిం

చినను వినజాలక యెందుల కిట్లు త్రిప్పల బెట్టె దవు? నన్ను త్రిప్పల బెట్టినను సరియే, పైన నిప్పులు గురిపించినను సరియే, లేదా, ముక్క ముక్కలుగా గోసి చిత్రవధ జేసినను సరియే, లేక, నిలువున నొక్కసారి భస్మీభూతము జేసినను సరియే, నేను మాత్రము నీ నామమును విడువను, నిన్ను యాచింపక మానను, నీ పాద కమలముల మరువను, నిన్ను ప్రశాంతతతో నిద్దుర బోనీయను. ఈ దాసుని రక్షింపనిదే నీ హృదయ శాంతి కవకాశము లేదు. సత్యము, సత్యము. న ... న

౨౭

సర్వాంతర్యామీ! నా మీద నీ కేల దయ రాదు? కరుణ దక్క కాఠిన్యము నీ యందుండ దని వి౦దును. అది సత్యమైనచో నాయం దింతటి కాఠిన్యమును జూప హేతు వేమై యుండును? ఈ యపవాద సూత్రమును నాపై నేల ప్రయోగించితిని. నిజముగా నీవు నాపై జూపుచున్నది కరుణయే యైనవో నయ్యది కరుణయే యని

గుర్తించి దాని నానందముతో ననుభవింపగల సామర్థ్యమును నాకొసంగుము. ఎటులైనను సరియే, జీవితమును సౌఖ్యానంతముగా గడుపుకొను శక్తిని బ్రసాదింపుము. కరుణామయుడవైన నీ వీపాటి కరుణ నాపై జూప జాలవా ?
న... న

## ౭౭

అమృతా ! ఆశచే నన్ని దిక్కుల బరిశీలించితిని. ఎటు జూచినను పుడమి సమస్త సస్య ఫల పుష్పశోభితమై యలరారు చున్నది. నదీ నదములు మధుర జలములతో బ్రవహించు చున్నవి. చల్లని పిల్ల తెమ్మెరలు పుష్ప సౌరభముల నెగజిమ్ము చున్నవి. కాని, వీనిని బొంది యానందించుటకు నాకవకాశ మెక్కడ? నీ కృపాకటాక్షములు నాపై బ్రసరింపనిదే, వీని ననుభవించుటకు నా కధికారము లేదని స్పష్టముగా దెలిసికొంటిని. నీ యనురాగము గలిగి నప్పుడు గదా, భోగానుభవము? ప్రోషితభర్తృకకు భోగములేల ? న... న

## ౭౯

విశ్వంభరా! విసుగెత్తి విసము త్రావవలె ననిపించుచున్నది. పతితపావనా! అస్మన్నాథా! నేడు నీకిదే త్రికరణశుద్ధిగా విన్నవించుకొనుచున్నాను. నేను నీకు విశదీకరించిన గడవు లోపల జ్ఞాపక ముంచుకొని నాకు నీ దివ్యదర్శన మొసంగి నను దీవించితివా మంచిదియే. లేదా, నిశ్చయముగా విసము త్రావి సుస్థిరుడనై భవచ్చరణ కమల ధ్యానముతో నదివ్యంబగు నీ భౌతిక శరీరమును బరిత్యజించి యాకస్మికముగ మెఱయు గ్రొక్కారు మెఱుపువలె పెట్టున విద్యుల్లతవలె వచ్చి నిను జేరగలను. అప్పుడు నామార్గమును నిరోధించుట నీతరమా? ఏ విధముననైనను నిన్ను బొందుటే పరమావధిగా నున్న నాకాత్మహత్యాదోష మంట నేయంటదు. ఒకవేళ నాకాదోష మంటినచో, నీకును నను జంపిన దోష మంటకపోదు. అప్పుడిద్దర మొక్కయంతరములోనే నివసింప వలసి యుండును. నాడు నన్నెట్లు తప్పించుకొందువో? నయమున విడువను, భయమున విడువను, భక్తిచే బ్రార్థిం

చెదను, పరమార్థమును సాధించెదను, చివరకు విసము మెసవుటచే విజయధ్వజమును పావ లోకమున పరంధాముడవగు నీ యెదుటనే ప్రతిష్ఠింపగలను. న...న

## ౬౦

పరంధామా ! పట్టినపట్టు విడువజాలను. బాధించినకొలదియు పౌరుషము చెలరేగు చున్నదే కాని పట్టును మాత్రము విడువజాల కున్నాను. కార్యసాధనకై యెటుజూచినను శూన్యము వినా వేరొండు గోచరించుటలేదు. అస్త్రము లన్నియు ప్రయోగించితిని, అంబుల పొది వట్టిపోయినది, ఇకముందు నేనేమి చేయ వలెనో నాకు దోచకున్నది. అబ్బా! ఈ యుపాయముల నాలోచింపజాలక మతి విభ్ర మము కలుగునట్లున్నది. ఇంక నేనేమి చేయ గలను ? నాథా ! శరణార్థిని. పాహిమాం పాహిమాం. న...న

౬౧

అఖండా ! ఆశ ముందునకు లాగుచున్నది; నైరాశ్యము వెనుక కీడ్చుచున్నది. ఈ రెంటి నడుమ జిక్కి మిక్కిలి బాధనొందుచున్నాను. మునుపు నీవలన ననుభవించిన మేలు నిరాశ జేసికొననిచ్చుటలేదు. నేడు నీవు చేయుచున్న కాలయాపనము ఆశకు తావిచ్చుటలేదు. కాని, నేటికిగూడ నిరాశకన్న నాశయే బలముగా నున్నది. దుర్బలమును బలము జయింపజాలదా? జయింపజాలనిచో స్వానుభవముచే లోకమునకు నేనొక క్రొత్తపాఠమును నేర్పవలసియుండును. న...న

౬౨

అనంతనామా ! అనుతాప మంతకంతకు హెచ్చిపోవుచున్నది. ఒక్కొక్కప్పుడు శరీరము నిలువున భగ్గుమని మండుచున్నట్లగపడు చున్నది. మరియొకప్పు డేమేమియో యూహాలు తాపరతంపరలుగా బయలుదేరి

యని నాతలలో నిముడక యూరపిడిచే నొక్క సారిగా కపాలము బ్రద్దలుగొట్టికొని బైటబడు నేమో యనిపించుచున్నది. ఈ యూరపిడికి నేనింక దాళజాలను; ఈ హింసలను నేనింక భరింపజాలను. ఇంతకన్న నన్ను చేతనాశూన్య మగు జడపదార్థముగా జేసివైచిన బాగుగదా? న...న

## ౯౩

పాపభంజనా! పాపాత్ముడనని నా మొగము జూడజాలకుంటివా? వాస్తవముగా నేను పాపాత్ముడనే; కాని, ఒక్కసారి నీ పదతాడనముచే నా పాపముల ప్రక్షాళనము జేయజాలవా? అక్కటా! ఇంక నీకేమి విశదీకరింపగలను? నా హృదయమును విప్పి నీ యెదుట నుంచితిని. ఇంకను గాలయాపన మొనర్చినచో నీ కీర్తిని దక్కనీయను. అది నిశ్చయము. పగవానివలె యెల్లకాలము సాధించువానిని ప్రార్థించుట నాచేతగాదు. న...న

౬౪

బంధవిరామా! పాదములబట్టి బహు భంగుల బ్రార్థించితిని. దీనుడనై మ్రొక్కితిని; దీనజనబాంధవుడవని నమ్మితిని; పతితపావనుడవని పజ్జను జేర్చుకొనుమంటిని; అనాథ నాథుడవని యాశ్రయించితిని; సకలసౌఖ్యదాయి వని సాష్టాంగపడితిని; కరుణా స్వరూపుడ వగు నీవు నావాడ వని నమ్మితిని; నిన్ను బ్రార్థించుటకు నా హృదయమునుండి వెలువడగల భావముల నన్నియు నుపయోగించితిని; నాచేతనైన భాష నంతయు వినియోగపరచితిని. ఇంక నే జేయ గలిగిన దేమున్నది ? కింకర్తవ్యతామూఢుడనై యూరకుండు టేగదా ? అక్కటా ! మ్రొక్కిన నాడు లేని మురిపెము, యాచించిననాడు లేని యాతురత, బ్రతిమాలిననాడు లేని పరమదయ, హతాశుడనై చేతులు ముడిచికొని మూగవలె కూర్చుండిననాడు కలుగునా ? యేమో యెట్లు జేసెదవో? నీ లీలలను నేనెట్లు గుర్తింపగలను ?

న...న

౬౫

భక్తప్రియా! ప్రతిమాలి ప్రతిమాలి ప్రాణము విసుగుజెందినది. ఇక నిన్ను ప్రతి మాలుట నాచేతగాదు. ఏపనికైన నొక వ్యవధి యుండవలెగదా? యెంతకాలము నే నీ పని జేయగలను? నీ వెంతటి సృష్టిస్థితిలయ కార్య ములలో మునిగి తేలుచున్నను, యీ స్వల్ప విజ్ఞాపనమును, చెవిజేర్చుకొను నంతటి యవ కాశము లేకున్నదా? అందులకు నే నొప్పు కొనను. ఎంతకాలము నుండియో మొరబెట్టి కొంటిని, యాచించితిని, ప్రతిమాలితిని, తుదకు భంగపడితిని. ఇక నిన్ను ప్రార్థింపను. నాకు జేసిన పరాభవమునకింక నిన్ను తిట్టుటే నాపని. తిట్లు దీవెనలై తేజరిల్ల జేయునో, బ్రహ్మ రక్షస్సులై పట్టిబాధించునో నాకేమి యెరుక? న...న

౬౬

భక్తవత్సలా! తిట్టవలెనని తోచి నిను బిలువ సంకల్పింపగా నప్రయత్నమున భక్త

వత్సలా! యను సంబోధనము నానోటినుండి వెలువడినది. అనివార్యమై బయలుదేరిన కమ్మని సంబోధనమును కడకు ద్రోసి కఠిన వాక్యముల నీపై నెటుల ప్రయోగింపగలను? తిట్టవలెనన్న దీవెనలు బయలుదేరుచున్నవి; మొత్తవలెనన్న ముంజేయి మెత్తబడుచున్నది; ఎక్కుబెట్టిన బాణము మొక్కుబోవుచున్నది. భక్తవత్సలుడవని నా యంతర్వాణి ప్రబోధించుచున్నప్పుడు, నేనేల దానిని నమ్మకపోవలెను? నిజముగా నీవు భక్తవత్సలుడవు. నీవాత్సల్యమేనాటికైనను నే ననుభవింపగలను. న...న

౬౭

సుజనజీవనా! నీ కృపను సంపాదించుటకై పడరాని పాట్లెల్లబడితిని. వేయేల నా మెదడులోని చమురునంతయు దీసి దివ్వెగావెలిగించి దానిం జేతబట్టి నీకృప యేమూల నున్నదో యని మరిమరి వెదకి వేసారితిని. ఏకాంత సమయమున నే చప్పుడు విన్నను నీరాకయే యని వీనులొగ్గి వింటిని. నిద్రావస్థలో యే స్వప్న

మును గాంచినను నీ వేమియో పలికితివని తిరిగి జాగ్రదవస్థలో మరల మరల నావాక్యములనే యుచ్చరించి మనసు గుదుర్చుకొంటిని. కాని, వానితో నేనింక దృప్తినొందజాలను. స్వప్నసందేశములను, విద్యుల్లతాదర్శనములను, అర్థరహితాభయహస్తములను జూచి నేనింక సంతసించు వాడనుగాను. ఈ చాటుమాటు వ్యవహారముల నింక సాగనంపుము. ఇదిగో, ఆసచే దోసిలి బట్టుచున్నాను; అమృతమస్తని నీ కృపారసమును నింపితివా, దానిం ద్రావి నాతాపమును దీర్చికొందును. ఇంతకు వినా వేరొండు పద్ధతికి నే నంగీకరింపను. ఇక నేమి చేసెదవో నీయిష్టము. న...న

## ౬౨

సుశ్లోకా! నీ సుచరిత్రమున కేల కళంకము నాపాదించుకొనెదవు? నమ్మిన వానిని నాశ మొనర్చుచుంటివిగదా? నాయందు దేలోపము లైన నుండిన నుండుగాక నీయందు జూపుచున్న భక్తిలో లోపమున్నదనినచో, దానిని మాత్రము

నే నంగీకరింపజాలను. వేయేల ? నాలోని ప్రతి రక్తబిందువును పరిశీలింపుము; ఆ బిందువులలో నున్న ప్రతిజీవాణువును బరీక్షింపుము; అయ్యవి నీ పదభక్తిచే బ్రాకులాడుచున్నవని నీ వంగీకరించి తీరవలసియుండును. నీ పదభక్తితో పాటు, నీవు రక్షించెద వన్న నమ్మకముగూడ నాలోని ప్రతి యంతరమునందును వ్యాపించి యున్నది. అయినను నీ కృపామృతమును గాంచకుండుట నా పాపఫలమో, నీదౌర్భాగ్యమో నేనూహింప జాలకున్నాను. న ... న

## ౯౯

జగచ్చక్షువా ! ప్రతిదినమును, ప్రతిక్షణమును నీకు మొఱ్ఱపెట్టుకొనుచుంటిని; కాలచక్రము గిఱ్ఱున దిరుగుచున్నది; ఒక్కొక్కదినమే జఱ్ఱున జారిపోవుచున్నది; సంవత్సరములు చుట్టి వచ్చుచున్నవి; సంతోషదినములు స్వప్నవృత్తాంతము లైనవి; సన్నుతులు మాత్రము చేయించుకొనుచున్నావు, మన్ననలకు సున్నజుట్టుచున్నావు అక్కటా ! యీ యవధిలేని

యాదోంళన, విసుగులేని విన్నపము, నిరామములేని విచారము, నేనెంత కాలము కొన సాగింపగలను ? నాథా ! నీ పాదసేవ చేసిచేసి చేతుల గడిగికొన వలసినదేనా? అన్యాయ మన్యాయము. న...న

౧౦౦

సచ్చిదానందా ! సరససల్లాపముల కిది యదనుగాదు. కావలసిన యన్నమో, గంజియో యొసగవలెగాని, కడుపు మండు వానికి గాంచ నాంబరముల గప్పిన నేమి ప్రయోజనము ? ఇక నీ గడుసుదనమును గట్టిపెట్టి కడపదాటి బయటకు రమ్ము; నీ పరువు ప్రతిష్ఠల బట్ట బయలు జేసెదను. నా చరిత్ర నెరిగి యున్నంత వరకు భక్తబృందము మధ్య నీ పదప్రవేశమున కైన తావు లేకుండ జేసి వైచెదను. ఇంత యంధుడవు, ఇంత బధిరుడ వౌదువని నే నొక్కప్పుడైన దెలిసికొన జాలక పోతిని. నీ బధిరతాంధతల నిప్పుడైన బోగొట్టుకొనెదవా, లేదా? చెప్పుము. ఇక నీ రోషమును నే

నాపుకొన జాలను, నీవాపజాలవు. ఈ రోష
ముచే నాతనువు దగ్ధమగుచున్నది. ఇది యాక
రోగమువలె నా శరీరము నంతయు నావ
రించినది. న...న

౧౦౧

జగన్నివాసా! ఈ జగమున నీవు లేవా?
నీ సర్వవ్యాపకత్వము నమసి పోయెనా? నీ
స్థిరత్వమునకు చేటు గలిగెనా? నీ యమృతత్వ
మంతరించెనా? కలవు కలవని చెప్పుచున్నారు,
కలవని నమ్మి యుంటిని. నీ విప్పుడు కలవా,
లేవా? ఉన్నచో నీకు చాటెందులకు? బైటకు
రమ్ము. పొత్తు గలిపి భుజింపుము; నాకష్టసౌఖ్య
ములలో భాగస్వామివి కమ్ము. అట్లు కాకున్న
చో "ఓం సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అను
ఋషి వాక్యముల నే నెంత మాత్రమును
నమ్మను. ఎంత ప్రయత్నించినను స్వానుభవ
మునకు రాని విషయముల నే నేల నమ్మవలె?
నే నట్లు నమ్మజాలను. నిజముగా నీవుంటివా,
బైటకు రమ్ము. రాకుంటివా, అమృతత్వము

నధష్ఠించితి నను కొనుచున్న నా యాస్తిక బుద్ధిని అట్టడుగునకు ద్రోసి నాస్తికుడనై "నదైవమ్ నదైవ" మని చాటించి వైతును. పిమ్మట నేమి కానున్న నది యాగాక. న...న

## ౧౦౨

అనాథనాథా! అనుభవముచే బరిశీలించిన కొలదియు నీ యస్తిత్వముపై నా కనుమానము కలుగుచున్నది. నిశ్చయముగా నీ వున్న యెడల యింతకాల మిట్లు వేధింతువా? ఇది వరకు నీ వుంటి వనియు నీ ఛాయల నప్పుడప్పుడు నే బొడగంటి ననియు నెంచుచుంటిని. అయ్యది భ్రమయని నేడు నిర్ధారణ జేసికొనవలసి వచ్చినది. నిశ్చయముగా నీవు లేవు, లేవు. ఉన్నచో దొంగవలె తొంగి చూడ వలసినంత బాధ నీకేల? ఉంటివా తెర వదలి బయటికి రమ్మా. మనసు గలిపి మాటాడుము. అట్లు కానిచో జగన్నియంత యను వా డొక్కడు లేడని నిశ్చ యించెదను, ఈ నిశ్చయములో తప్పున్నచో దానికి బాధ్యుడను నేను గాను. న...న

౧౦౩

రూపరహితా! స్వానుభవముచే వేదము లసత్యములనియు, ఉపనిషత్తు లూహాగానము లనియు, ఆస్తిక ప్రమాణ సూత్రము లర్థ విహీనము లనియు నిశ్చయించు కొంటిని. అవి యన్నియును ప్రకృతికి పరుడైన జగన్నియంత వేరొక్కఁడున్నాఁడని నిర్ణయించు చున్నవి. అది నే నంగీకరింపను. ఒకవేళ నది నిజమైనచో, ఆ విషయము నా యనుభవమున కేల రాదు? నా యనుభవముచే నిజముగా సకల జగన్నియంతృత్వము జగజ్జనని యగు ప్రకృతి మాతదియే కాని మరొక్కనిది గాదని తెలిసికొంటిని. సకల ప్రాణులును పరితాపము నొందుచున్న గ్రీష్మ కాలమున నిండుగ విరియబూచి పచ్చిబాలింత వలె నున్న వకుళ వృక్షము నను జూచి నవ్వు చున్నట్లున్నది. ప్రకృతినారాధించుటచే నయ్యది విచార మెరుగక కాలము గడుపు చున్నది. అందుచే నది నను జూచి నవ్వుట తప్పుగాదు.

"శుభస్య శీఘ్ర"మని నేనును నేడే ప్రకృతి మాత నారాధింప దీక్షగైకొన గూడదా? న...న

౧౦౪

అనంతా ! అసువులపై రోత గలిగినది. నిశల యందు నిద్దుర లేకున్నది. ఒక వేళ నిద్దుర వచ్చిన వెంటనే యేమియో స్వప్నము బయలు దేరి మెలకువ దెచ్చును. పిమ్మట, అస్తి, నాస్తి, యను తర్కముతో తల బ్రద్దలు గొట్టుకొను చుంటిని. ఇక నీ తర్క విచారణతో నే నెంత కాలము గడుపగలను? నేటికిని, నీవు కలవా, లేవా ? యని ప్రశ్నించి నప్పుడు, ఉన్నాను, ఉన్నానను దివ్యవాణి యేదియో ప్రమోగినట్లు వినబడు చున్నది. కాని, వానిని విని సంత సించెడి కాలము గతించినది. ఇక నీ మచ్చు మందులకు నే లోబడను. నిజముగా నీ వుంటివా మాయ మర్మములు విడిచి మన సిచ్చి మాటా డుము. మాటాడవా, మన యిద్దరి సంబంధ మును యీ నాటనే నీ చేతితో గత్తిరించిన వాడ వగుదువు. న...న

౧౦౫

అవ్యక్తా! సమయము నిశీథము. సకల జీవులును గాఢనిద్రా పరవశమున తాత్కాలిక ముక్తావస్థ నొంది యున్నవి. నేను మాత్రము పిశాచమువలె నీవేమూల నుంటివో యని వెదకు చున్నాను. ఎంత వెదకినను అవ్యక్తుడవే యయితివి. అందువలన నీవు లేవని సంపూర్ణ నిశ్చయము జేసికొంటిని. నాథా! ఒక వేళ నీ వింకెచ్చటనైన దాగితివేమో యని మరల తుట్టతుద విన్నపముగా నీకు జెప్పుచున్నాను నిజముగా నీ వున్నచో నీ దివ్యదర్శన మొసంగి నను గృతార్థుని జేయుము. నా శక్తి యంతయు నుడిగినది. ఇక నేనీ తత్త్వ విచారము జేయ జాలను. నా తల బ్రద్ద లగుచున్నది. హృదయ తాప మధికమై రక్త మత్యంత తీవ్రమున బ్రవ హించు చున్నది. శల్యములు శూలములై యొక దాని నొకటి గ్రుచ్చుకొని బాధించు చున్నవి. ఇంక నేనీ బాధల కోర్చుకొన జాలను. నిన్ను బ్రార్థించి నందులకు ఫలము యిదుమల

గుడుచు టేగదా? అబ్బా! యింక నే నేమి చేయుదును? యేది తెరవు? యీ తాపము నెట్లు చల్లార్చుకొందును? నాథా! ఇదిగో, యిటు జూడుము. నా స్వేదనాళములనుండి యీ బయలుదేరుచున్నది చెమటయా, రక్తమా? ఇయ్యది నీదివ్య హస్తమున దుడిచి నాతాపము జల్లార్పజాలవా? హతోస్మి, హతోస్మి, నాథా! నేటితో నీకును, నాకును సంబంధము తీరి యుండ వచ్చును. ఇదియే నా జీవితమున గట్ట కడపటి విజ్ఞాపనము. ఇక నిన్ను బ్రార్థింపను. పరమేశ్వరుడు లేడు లేడని లోకమున జాటుటే యిక ముందు నే జేయుపని. న...న

## ౧౦౾

భద్రాత్మకా! సర్వభద్రసంధాయకు డగు భగవంతు డొక్కడున్నాడని చదివితిని, వింటిని దానినే యితరులకు గూడ నే నుపదేశించితిని. నా వెర్రి యుపదేశముల దలచుకొనినచో నా కిప్పుడు సిగ్గగుచున్నది. స్వానుభవములేని విషయమును బోధించిన నిప్పుడు లోకమునకు

దండనార్హుడను. యుక్తి ప్రయుక్తులచే సాధించిన తర్క సిద్ధాంతముల నమ్మి, తజ్జీర్ణ పురాణ వాక్యముల నితరుల కుపదేశించితిని. ఇక్షురసము మధురముగా నుండునని చెప్పుటకు నాకధి కారము గలదుగాని, పరమేశ్వర కృపారస మిట్లుండునని చెప్పుట కధికారములేదు. తద్రసానుభవము కలిగి నప్పుడే దానిని గూర్చి నిర్వచింప దగును. మున్నెన్నడో తదుచి ననుభవించితి ననుకొంటిని. అది పొరబాటు. ఆలోచించిన కొలదియు, దాని యందు దివ్యత్వము, విలక్షణ రుచి నాకు గోచరించుట లేదు.
న...న

౧౦౭

శుభకరా! నీ యస్తిత్వముపై ననుమానము గలిగి నీవు లేవని నిర్ధారణ నొనర్చుకొనిన పిమ్మట నీప్రార్థనకై వినియోగించెడి కాలము మరి దేనికి వినియోగ పరుపవలెనో నాకు దోచక చీకాకు పడుచుంటిని. నినుగూర్చి వ్రాయు నా లేఖిని తుప్పుబట్టినది. నీకొరకు విచారించెడి మేధస్సు

మొద్దువారినది. నాథా! నా యశోహాల నుప సంహరించుకొను చుంటిని. నీవు నన్ను రక్షించి నను సరియే, శిక్షించినను సరియే; నీ యస్తిత్వము మాత్రము సుస్థిరమగుగాక. పరమేశ్వరుడవగు నీయం దహేతుక భక్తియో లేక కష్టజాలములలో దగుల్కొని కావు కావు మని యేడ్చెడి ఆర్తభక్తియో, యేదియో యొక విధమైన భక్తి యేనాడు నీయందు చూపకుందునో, ఆనాడే నా తనువు దగ్ధమై పోవుగాక. ఏనాడు నీపాదసేవ చేయకుందునో ఆనాడే నా కరములు ఖండఖండములై కాక గృధ్రముల కాహార మగుగాక. ఏనాడు నీ ధ్యానమును మానుదునో ఆనాడే నా హృదయము ప్రీలిపోవుగాక. న...న

౧౦౮

పరిపూర్ణా! అష్టోత్తర శతనామములచే నిన్ను సంబోధించి యొక్కొక్క నామమున కొక్కొక్క విన్నపమును రచింపవలెనని సంకల్పించి ప్రారంభించితిని. అది నేటితో పరిపూర్ణము గావింప జేసితివి. నిద్రావస్థలో నున్న నన్ను జాగ్రదవస్థలోనికి గొనివచ్చి యీ "భక్తజీవనము"ను నాచే నెందులకు రచింపజేసితివో నీకే

తెలియవలె గాని నేనెరుగజాలను. ఇతరిపూర్వ పరిస్థితుల బరిశీలించినచో నా జీవితాంతము లోపల మరల నేనొక గ్రంథరచన జేయుదు నను నమ్మకము నాకెన్నడును గలిగి యుండలేదు. నాథా! నీదృష్టిమారినచో, కొండ పిండియగును, పిండి కొండయగును ఏనాటికేది యెట్లు జేయుదువో మాబోంట్ల కూహాతీతము. ఏకార్యమున కైనను అస్మదాదుల ప్రయత్నము నిమిత్త మాత్రమేకాని ఫలము నీవలననే కలుగ వలసి యున్నది. కావుననే, నీపై నేడే నాజీవిత భర న్యాసమును జేయుచున్నాను. ఇక నన్ను నీట ముంచెదవో, పాల ముంచెదవో, కాచెదవో, కాల్చెదవో, కడతేర్చెదవో, కడలి కొప్పగించెదవో, నీ యిష్టము. నమో నమ శ్శ్రీమన్నారాయణా.

మంగళమ్.

ఆశ్రిత జనావనునకు మంగళమగుగాత. భక్తాభీష్ట ఫలప్రదునకు మంగళమగుగాత. సకల శుభప్రదాయకునకు సర్వదా మంగళమగుగాత. దివ్యమంగళ స్వరూపున కెల్లయెడల మంగళ మగుగాత. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA126B147 |
|---|---|
| పుస్తకం పేరు | భక్తజీవనము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2,4,8 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | neema |
| పేజీలు విడదీసినది | neema |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |